కం. సులువుగ నగు నని యెయ్యది
దలంతుమొ యది యేగు మిగుల • దవుదవ్వగుచుం
గలలోనే నెది యగు నని
తలంపమొ యది యప్పు డగును • దైవవశమునన్ !

అచ్చటఁ దురుష్కో_త్తమకులసంభవుండును, శాంత్యౌదార్యాది సుగుణగణవిభవుండును, బ్రితిఫలాపేక్షారహితమనీషాభేషజప్రదానకళామాననీయభిషగ్వరుండును, నగు నన్నేమియ్యా నాపాలిజియ్యగ నెయ్యంబున నన్నుఁ గ్రమంబునఁ బునర్జీవితుం గావించె.

నేనిట్టియాపన్నదశ నుండ నిట బ్ర॥శ్రీ. వేంకటపద్మనాభ శాస్త్రులుగా రీకృతి సాంతంబుగఁ బఠింప నెంచి యెడపాదడపా చదువుచు నా సమయమున నీ పట్టనమునకు విజయము చేసియుండిన వీరిప్రభువురాలుప, శ్రీమత్కో_లంక వీరవరము లోనగు తాలూకాల జమీందారురాలును, నగు మహారాజరాజశ్రీ శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి దర్శనార్థమై వారి సన్నిధానమునకు వెళ్లుచు దీని వెంటఁ గొని చనిరఁట. అప్పు డచ్చట శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి సోదరులును, శ్రీమద్వినిగడప ఉంగ్రాజవరము లోనగు తాలూకాల జమీందారులును నగు మహారాజరాజశ్రీ. రాజా వెల్లంకి వేంకట రామారావు బహద్దరు వారును వారిభాగినేయులును శ్రీమత్పిఠికాపురసంస్థానప్రభువులును నగు మహారాజరాజశ్రీ శ్రీరాజారావు వేంకట కుమార మహీపతి సూర్యా రావు బహద్దరు జమీందారువరును నుండిరఁట. ఆప్రభుయుగం బది యేమి గ్రంథం బని యడిగెనఁట. శ్రీకృష్ణపరిణయం బనుచుఁ గొంత చదువుఁ డనియన వేంకటపద్మనాభ శాస్త్రులుగారును గొంత చదివిరఁట. పిమ్మట రాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరువారి యెక్కడఁ గొననగునని యడిగి యముద్రితం బని తెలిసికొనిరఁట. పదపడి యొకనాఁడు వారు మైలాపురిలో నుండు తమవసతికి శాస్త్రులవారిని బిలిపించి యీగ్రంథము సాంతంబుగఁ జదివించి విని దీనికి ముద్రాభృతి మే మొసఁగెదము దీని ముద్రింపఁ బ్రయత్నింపుఁ డన నిది జీపత్క_విక్కృత మనియు, నాకవి గారి సమ్మతి నొందవ ననియు శాస్త్రిగారు చెప్పిరఁట. ఈవిషయమంతయు ౧౯౦౧-వ సం॥ అక్టోబరు నెల ౧౯-వ తేది గల లేఖామూలకముగ శాస్త్రులవారు నాకుఁ దెలియపఱిచిరి. నేను శుభోదర్కంబున కిది యంకురార్పణంబుగ నెంచి యట్ల కావింపుఁడని ప్రత్యుత్తర మిడితి. వారును దీనిని బహు ప్రయాసమున కోర్చి ముద్రింపించిరి. మహారాజశ్రీ రాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరు జమీందారువారిని నాపాలిపుణ్యపురిగొల్పె నని నెమ్మది నమ్మెద. కాకున్నచోఁ గడపమండలవాసి నే నెక్కడ ? కృష్ణమండలస్థులగు నీప్రభువుగా రెక్కడ ? ఎన్నియో యుత్తమగ్రంథములం బఠించినవారి నాకృతి రుచించు టెట్లు ? నేఁటికాలపుఁబ్రభువులకు నాంధ్రవిద్యాభిమానముండు టె

ఉండెనో దానికై ధనవ్యయముచేయ సాహసికు లగు టెట్లు? అయిరిపో యయాచితంబుగ నన్యులకృతికి ముద్రాభృతికై వందలు వెచ్చించు నుదారు లగు టెట్లు ?

ఈకావ్యకన్య జన్మప్రభృతి శ్రీరామచంద్రునకు మన్మనోద త్తయయ్యు నష్టమ వర్షంబునఁ గాని వివాహయోగ్య గాదని కాఁబోలు నేఁటివఱకు నావేల్పు బాహిరంబుగ దీని నంగీకరింపక యుండె నని తోఁచెడి.

ఇంతకాలము నన్ను సెలవుపై నుంచి యిప్పుడు నాదేహంబు స్వస్థతఁ గాంచుట వలన మరల హిందూపాఠశాలాధ్యక్షులు నాయందు దయగలిగి నన్ను నీకొలువునఁ బ్రవేశపెట్టిరి.

ఇట్టి మహోపకృతులు నా కొనరించిన పైసుకృతుల కొక్కరికేని నే నెట్టి ప్రతికృతియుఁ జేయఁ జాల. ఇన్ని దుష్కరంబుల సుకరంబులుగ నొనర్చిన యఘటనఘటనాచాతురీధురీణుం డగుశ్రీరామ చంద్రుఁడే వారి యోగక్షేమభారంబు వహింపఁ బోరిం బోరి నాదైవంబుఁ బ్రార్థించుచున్నవాఁడ.

ఆ. వె. దైవకృతము లిపుడు ♦ భావింప విష మయ్యు
మీఁద నామృతమున ♦ మేల యిచ్చు.

అని నే నేనాఁడో వ్రాసిన దానికి శ్రీకౌసల్యాపరిణయము కరణి శ్రీకౌసల్యాపరిణయంబు లక్ష్యమై పరిణమించెను. రాల నీటఁ దేలించిన మేటి కసాధ్య మెయ్యది ?

శ్రీకుమారాభ్యుదయము వ్రాసి ముగించిన పిమ్మట నొక్కనాఁడు రాజంపేటలో నేను "శిరస్తాదార్" పదవియందు నుండుతఱి నాజనయిత్రి తాను గోటతికమునకు వచ్చినక్రొత్తలోఁ జిన్నవయసున నున్న నాపితృవ్యులు మహారాష్ట్రభాషలోని కౌసల్య పెండ్లికథను జదువుచుండఁ దాను వింటి ననియుఁ, జిరకాలమున వినికి యగుటఁ గథయంతయు మఱచితి ననియు, దానిం గృతిగా నొనర్పు మని యందదుకులుగఁ గొంతకథ చెప్పెను. విన్నంతవఱకు నదె వింతగ నుండుట సంపూర్ణంబుగ దాని నెఱుంగఁగోరి యప్పుడు నాయెఱింగిన మిత్రులకును, పండితులకును, సంస్కృతాంధ్ర పుస్తకవిక్రేతలకును, వ్రాసితిఁగాని మనోరథము మాత్రము సఫలము గాదయ్యె. ఇట్లుండ ౧౯౨౩-వ సంవత్సరమున శ్రీకుమారాభ్యుదయముం బ్రకటించితి. తదనంతరము వేంకటగిరిలో నున్న బ్ర। శ్రీ। మ-రా-రా-శ్రీ లంకలపల్లి వేంకటసుబ్బయ్యగారు లేఖాపరిచితులగుట వారికి నాసంకల్పం బెఱింగింప వారు దామామహారాష్ట్రగ్రంథంబుఁ బఠించితి మని యాకథాంశంబు లేఖామూలకమున నెఱింగించిరి. ఆ యుత్తరమును మాతృకగాఁ గొని నే నీకృతి రచియించితి.

ఇందలి కొన్ని వర్ణనము లందప్పుడు కొంచె మప్రస్తుత మగపడు చున్నదని తోఁచెనేని యవి గ్రంథ విరచనకాలమునకు ప్రస్తుతములుగా నుండెనని చదువరులు గ్రహింతురుగాక.

నా వ్రాఁతప్రతిలోని రమారమి ౧౦౦ పద్యములు క్లిష్టముఁగ నుండుటచేతను బూర్వవర్ణనాసామ్యము నొందియుండుటచేతను నీముద్రితప్రతియందుఁ దొలఁగించితిని గాని యాఱవ యాశ్వాసమునఁ గడపటఁ గొన్నిపద్యము లెక్కువగఁ జేర్చితి.

౩-వ యాశ్వాసంబున * గుర్తుగల పద్యముల కన్నింటికి నప్రస్తుతంబున రామాయణార్థము గలదు.

ప్రత్యాశ్వాసాంతపద్యప్రథమపాదప్రాసాక్షరంబులఁ గ్రమంబుగఁ జూచినచో „కౌసల్యావివాహం” „రామార్పణమస్తు” అని యేర్పడును.

శ్రీకుమారాభ్యుదయంబునకు మత్కర్తృత్వము నొకానొకఁడు సందేహించినకారణమునఁనట్టికుశంకల కెడమీయకుండుటకై ౧౨-వ పుట ౧౪౫-వ పద్యంబునను, ౩౮-వ పుటలో ౧౯౪ చక్రబంధపద్యంబునను, ౫౩-వ పుట ౧౧౩-వ పద్యంబునను, ౧౧౩-వ పుట ౫౧-వ పద్యంబునను, నింకఁ గొన్నిపద్యంబులను నాపే రిమిడ్చితి. ౫౦-వ పుట ౭౩, ౫౧-వ పుట ౭౬, ౭౯, ౯౨-వ పుట ౬౪, ఇట్టిపద్యముల కర్థము కాదినవేత్యాది సంఖ్యాసూత్రింబులం బట్టి గ్రహింపవలయును.

ఆంధ్రిభాషాస్థితి యిప్పుడు కొంచె మభ్యుదయోన్ముఖ మగుచున్నట్లు తోఁచుచున్నది గాని

కం. వెలయాంధ్రు రెందఱైనను
గులకాంతకునీడు గారు కువలయమందుక్
బలువిద్య లెన్నియైనను,
గులవిద్యకు సాటి రావు • గువ్వలచెన్నా”

యన్న యసమానవాక్యమును మఱవక తమదేశము నభ్యుదయంబునకును, దమకైహికాముష్మిక లాభంబులకును, నిదానమైన మాతృభాషకు, సంపూర్ణగౌరవముఁ జూపుబుద్ధి భగవంతుఁ డొప్ప డాంధ్రుల కొసంగునో.

నే నీకృతి రచియించిన పిమ్మట నాపరిచితు లొకరు, శ్రీపాద వేంకటాచలకవి ప్రణీతమైన శ్రీకౌసల్యాపరిణయంబను ౫- ఆశ్వాసముల గ్రంథమొం డిదివఱకేయున్నదని యొకముద్రితప్రతి నంపిరి. దానిం జూడ దానికిని దీనికినింగృతిపేరునను, నాయికానాయకనామములను, మాత్రము సామ్య ముండెను గాని కథావిషయంబున నించుకంతయు సంబంధము లేదు. మఱియొక కౌసల్యాపరిణయ మనుయక్షగాన ప్రబంధము ప్రకటనమును వార్తాపత్రికలం జూచి దానిం గొని చదివితిని గాని యది కథయందుమాత్రము కొంచెము సామ్యము గలదై యుండెను.

శ్రీకుమారాభ్యుదయమును బ్రకటించినపిమ్మట దానిం జదివిన పరిచితాపరిచితు లగుపండితమిత్రులు నది మిక్కిలికఠినశైలిఁ బండితైక వేద్యంబుగ వ్రాయంబడినదనియు, నీతూరివ్రాయంబడు గ్రంథమును గాలానుగుణముగఁ గొంచెము సులభశైలి రచియింపుమనియు, బోధించిరి. వారి హితబోధ మనుసరించి సులభశైలిని నీకృతి నిర్వహించితి. ఇంతకు సులభ శైలి కావ్యములకు రుచింప దనితలంచెదను. అయినను

దీనిపై సజ్జనాభిప్రాయ మెట్టు లుండునో యారసి వలసినచో నింకమీఁద దాని ననుసరించెద.

వర్ణనాంశములయందు సాధ్యమైనంతవఱకుఁ బ్రకృతి ననుసరింపఁ బ్రయత్నించితిఁ గాని యాయుద్యమ మెంత వఱకు సఫలమయ్యెనో చదువరులకే యెఱుక. యువతివిపరీతశృంగవర్ణనాదుల కిందు వలసినంత యవకాశ మున్నను బ్రకృతకాలమునం దవి రుచింపకుండుట యటుండ నవి పాపావహం బనియు నెంచి వానిని మానితి.

ఈకావ్యమునకు మూలగ్రంథం బీపేర నెసఁగుచున్న దని వినుటచేతను, బరిణయమే కథ కంతకును బీజభూతంబగుటను, దీనికి శ్రీకౌసల్యా పరిణయం బనుపేరిడినను బరిణయభాగము మాత్రము మిక్కిలి యల్పమై యున్నది. (మృచ్ఛకటికవలె నిది యెంచంబడుం గాక.) కావునఁ బరిణయనామమాత్రమున శృంగారవర్ణనాభూయిష్ఠ మని తలఁచి యెవ్వ రేని గర్హింపకుందురు గాక.

పూర్వకవీశ్వరులు ద్రోక్కనిత్రోవలును, నూహింపనివిషయములును, లేవు. అయినను సాధ్యమైనవఱకు నూతనవర్ణనములే వ్రాయఁ బ్రయత్నించితి. నేను గ్రొత్తగ నూహించివ్రాసినాఁడ ననియనుకొన్న వర్ణనములు కొన్ని పదపడి సంస్కృతాంధ్రకావ్యములంజూచి యట్టివాని నెల్లఁ దొలఁగించితి. ప్రమాదంబున నింకను నట్టివి తప్పియుండిన నుండ వచ్చును. ఈనియమము పద్యశైలియందును నవలంబింప సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించితిని గాని గుణపక్షపాతంబునను దుశ్ఛేద్య చిరతరపఠనాపరిచయబలకారణంబునను గొన్నియెడల దీనిం బాటింపమి నెఱుంగుదు.

ఈగ్రంథము నందలి గుణాగుణవిమర్శలకు సమచిత్తు లగు విపశ్చిత్తులే శరణము. సజ్జనులు స్వభావముగ గుణగ్రహణపరాయణు లగుట వా రప్రార్థితు లయ్యు గుణము నేగ్రహింతురు. అట్టివారికి విధేయుఁడనై నమస్కరించుచున్నాఁడను. ‹‹ప్రమాదో ధీమతా మపి” యనియుండ నిఁక నాయట్టి కించిజ్జ్ఞునకా ప్రమాదము లేక యుండును.



ఈగ్రంథమునుబ్రకటింపఁగలుగుటకై ధనసాహాయ్యమొనర్చిన మహారాజరాజశ్రీరాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరుజమీందారుగారికి నాయురారోగ్యైశ్వర్యాద్యభ్యుదయంబు లొసంగ భగవంతునిఁగూర్చి యిట్లు ప్రార్థించుచున్నాఁడ.

పంచరత్నములు.

---

సీ. శ్రీకరుణాగాఢు•శ్రీమీఱుపుష్పవ•ద్విస్ఫురన్నేత్రాబ్జ•విలసితుండు
పూతధీనిత్యపి•భూతిదానవినిద్ర,పద్మానిమేషాక్షి•ప్రాణవిభుఁడు

మారుతసుతసర♦మావల్లభులకు న,మర్త్యత్వమొసఁగిన♦మానధనుఁడు
గౌతమప్రియవధూ♦ఘనజాడ్యహరుఁడగు, నతభవామయతాప♦హృతిచణుండు
రాజు వెల్లంకి వేంకట♦రామరాయ, బహదరంకితుఁ బెంపాల ♦ మహితగోత్రు
రేయుఁబవలును బ్రోచుత♦శ్రీచిరాయు, రతులితారోగ్యవిభవసం♦గతునిఁ జేసి. ౧

తే. క్షీరనిధిజాత, యిందిర, ♦ శ్రీవధూటి, భువనమాత, రమాదేవి ♦ పూర్ణకృపను
రాజకులజాతవేంకట♦రామరాయ, మందిరావాస యగుత న♦క్తందివంబు. ౨

ఉ. శంకయొకింతలేక యని♦శంబు విరోధివరూథినీహృదా
తంకకరంబు,స్వాశ్రితసు♦దర్శన మైనసుదర్శనంబు వె
ల్లంకి కులాబ్ధిసోము, నక♦లం, కనుజాతనుజాతసంగతున్
వేంకట రామరాయ పృథి♦వీపతి విశ్రుతకీర్తిఁ బ్రోవుతన్. ౩

సీ. రాజకులాంభోధి♦రాకాసుధాంశుని భా,వుకశీలగుణజాలు ♦ సుకలుఁ బెంపు
చెలఁగ సంతతబుధా♦శీర్వచనకలితో,ల్లాసమానసు,దయా♦భాసమాను
యదుకులప్రవరపా♦దాంబుజాసక్తస,న్మానితచరితు దు♦ర్మానరహితు
రాజిత నిర్జరాం♦ఘ్రికకళాబ్ధిమథనభ, వుకసుధాస్వాదన♦పూతచిత్తుఁ
బ్రేమ వెల్లంకి వేంకట ♦ రామరాయ,మహిపవర్యుని ననమాన♦మహిమునిఁగాఁగ
బ్రోచుఁగావుత నిరతంబు ♦ బుధవినుతుఁడు, చుట్టుఁగైదువ్వవలమురిఁ♦బట్టుప్రోడ. ౪

---

సీ. విశ్రుతసత్కీర్తి ♦ పెదరామ రాయఁడే, పూతచరిత్రుని♦తాతతాత
ఘనతరసమ్మాన♦ధనుఁడు మల్లారావు, ధాత్రీశుఁడేప్రభు♦తాతతండ్రి
విబుధసంస్తవనీయ♦వేంకటకృష్ణరా,యండేదయాశీలు ♦ తండ్రితండ్రి
గణనీయగుణుఁడుజ♦గన్నాథరాయఁ డే,దానశీలాత్మునిఁ♦తండ్రి యట్టి
రామపదభక్తు వేంకట♦రామరాజ, విభువరేణ్యునిఁబ్రోవుత ♦ విశ్వధర్త
భక్తశుభకర్త నతలోక♦పంకహర్త, జానకీభర్త కరుణచే ♦ సంతతంబు.

తిరువల్లిక్కేణి
1902 సం॥
మే నెల 4-తేది.

సుజనవిధేయుఁడు
వావిలికొలను సుబ్బరావు.



శ్రీరామాయనమః.

శ్రీ శారదాయై నమః

# శ్రీకౌసల్యాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

—* ఇష్టదేవతాస్తుతి. *—



నారాయణునిత్యముక్తశుభగో◆ష్ఠీసభ్యతావాప్తికిన్
ధ్యానింతుం జతురాత్ము, సంసరణవి◆స్తారాబ్ధినిస్తారకున్
శ్రీనాథాత్మకు, శ్రీనివాసు, హరి, ని◆శ్చింతాప్తి నాత్మోద్భవా
స్తానాశోద్యమునైరిసంహరణకౌ◆శల్యాయనున్, రామునిన్. ౧

సీ. ఏసతిశీలంబు ◆ హృదయంగమంబునై, రాము నిస్తులయశో◆ధాముఁ జేసె
నే రమణీమణిఁ ◆ గూరిమి లోఁదాల్చి, పాంసుల రత్నగ◆ర్భగ రహించె
నేకరుణాలయ ◆ హింసింప నెంచిన, పలువ కిప్పించె న◆వ్యయసుఖంబు
నేభక్తవత్సల◆యేపారుకరుణచేఁ, జెనఁటికాకము చిర◆జీవి యయ్యె
ఆ. నాపిపీలికాజ ◆ మేపురంధ్రీలీల, యేమె శ్రితులఁ బ్రోవ ◆ నెదురుపోవు
స్థిరమానస, త్రిజగ◆త్సవగీర్ణగుణపూత, సీత నన్ను ధన్యుఁ ◆ జేయుఁగాత. ౨

సీ. మూఁడువేదంబులు◆ముప్పిరి నల్లిన, వేణితోఁ గృతిఁదాల్చు◆పాణితోడ
వెన్నెల గ్రుక్కియించు ◆ వెల్లనివలిపంపు, టొల్లెతోఁ జిన్నిజా◆బిల్లితోడఁ
జేవోకువాదోడు◆చెల్వారుముద్దుల, చిలుకతో మురిపెంపుఁ◆బలుకుతోడ
సరిగమపధనిస◆సధపమగరిస య, న్వీణెతో నిగ్గరీ◆శ్రేణితోడ
తే. వ్రాలువిరిచూలునిల్లాలు ◆ పూలనాలు, దాల్పుప్రోయాలి కేరాణి◆వేల్పుచాలు
నేలు విద్దెలజవరాలు ◆ మేలుగ్రాలఁ, జాల నాపాల నిల్చి న◆న్నేలుఁగాత. ౩

మ. ధవుస్వాంతప్రతిభాత్ముఁ గాంచి నిజమ◆ధ్య, స్వాదునిశ్వాస, స
చ్ఛవి, లావణ్య, నితంబసామ్య మొనరం◆ జల్పంగ బోధించినన్
దివి, వాతా, గ్నిపయఃకుచక్రములఁ దా ◆ నిర్మింప శాలీనుఁడై
సవవాణిం గవుఁగింటఁ జేర్చు నజు స్వాం◆తంబందు భావించెదన్. ౪

ఉ. నీరసయుక్తిరక్తిను ◆ నీమధుధర్మము నిర్మలత్వముం
బేరువహించుమేనఁ బ్రభ◆వించుటయుం గన సాటి యెవ్వరే

బోరన గౌరినిందలను ◆ బూనఁగ నాపగ నేర్తు నెట్లు నైఁ
జేరుపనంచుఁ దా సవతి◆చేడెల నొక్కట నూఱడించు సం
సారి హరుండు నాబహుళ◆సంకటముల్ హరియించుఁ గావుతన్. ౫

ఉ. వైరిగదా మరుండు మగు◆వా! తగ వౌనె తదంకపాళులం
జేరుప నంగపాళి మదిఁ◆జింతిల కింత? యనం గపాలితోఁ
గూరిమిఁ గూర్పఁగా మనలఁ ◆ గుంటెనకాఁ డగు నాయనంగుఁడున్
వైరియె? యంచు నవ్వెదుభ◆వాని దయన్ శుభవాణి నిచ్చుతన్. ౬

తే. ఎవని ముదలార సేవింతు ◆ రెల్ల విబుధు, లెవనిముద లారసి చరించు◆నెల్ల సృష్టి
మొదటితెలయూరిశ్రీ సేన◆మొదలి సూరి, మీఱునుద్భవములఁ ద్రుంచు◆మేలు వెంచు.

ఉ. స్వాంతమునన్ భజింతు గుణ◆వంతు, మహాబలవంతు, దైత్యసు
ద్ధాంతతమాలపత్త్రఘటి◆తాంతుని, దాంతుని, శాంతు, దుష్కృత
ధ్వాంతఖరాంశుమంతు, వసు◆ధాతనయాఘనశోకశాంతు, ధీ
మంతు, దయానిశాంతు, హను◆మంతు, నతాయవనీవసంతునిన్. ౮

కం. సకలకళాధారు శర, త్సకలకళాధామరుచిని ◆ సైంధవగళునిన్
శకలీకృత సైంధవగళు, సకలు న్ననుఁ జేయ భక్తి◆సన్నుతియింతున్. ౯

## —* సంస్కృతాంధ్రకవీంద్రవినుతి. *—

ఉ. భారతి యేమహామహుని ◆ వాక్కనురంగమునందు సద్యశో
భారతినాట్యముం జలిపెఁ ◆ బాత్రమునాఁ దొలుప్రొత్త హర్షశో
భారతి మీఱ నందెలర◆వంబులు కర్ణరసాయనంబుగా
నాఋషి నేఁ దలంతుఁ గవి◆తామరశైవలినీత్రివిక్రమున్. ౧౦

కం. ఖేదముఁ దొలఁగింపఁగ స, మ్మోదము ఘటియింప భోగ◆మోక్షశ్రీ లా
పాదింపఁగఁ జాల్పంచమ, వేదము రచియించు నపర◆విధు నేఁ గొలుతున్. ౧౧

తే. కాళిదాసకవీశ్వరు◆ఘనుని దండి, పండితుని దండి, జయదేవు◆బాణు, మాఘుఁ
జోరుని, మయూరు, భవభూతి◆భారవి, మది, సుకవిలోకేశులను గొల్తు◆సూక్తులకు దవ

ఉ. భీముని, నన్నపార్యు, నెఱ◆ప్రెగ్గడఁ, దిక్కన, నాయదర్వణున్
సోము, ననంతుఁ, బెద్దనను ◆ సూరన, భాస్కరుఁ బోతసత్కవి
గ్రామకవీశు, వెండి సిరి◆నాథునిఁ, దిమ్మనఁ, బిన్నవీరవన్
రామనృపాలభూషుఁ, గవి◆రాజుల నెంతుఁ బ్రశస్తసూక్తికిన్. ౧౩

కం. సాధునికరవంద్యుల నే, నాధునికకవీశులన్ మ◆హాత్ముల మది నా
రాధనకయి తెలుతున్ గం, గాధునికాభంగభంగ◆గంభీరోక్తిన్. ౧౪

వ. అని దేవతావందనంబును, బురాతనాధునాతనసత్కవీశ్వరానందనంబునుగావించి జన్మసాఫల్యంబుగనొక్క పుణ్యకార్యంబురచియింపఁదలంపు చెంగలింపనుద్యుక్తుండ నై.

చం. కవియును న ర్తనాంగనయు◆గష్టము చెంతలు గల్గియున్న న
య్యవి వెలిఁదోఁపనీక వెల◆యన్ వలయున్ వెలినాడు న ర్తకిన్
భువిపయిఁ జూపఁజు గ్గసఁగఁ◆బోరు హృదంతరవ ర్తివేదనన్
నెనమిడి లోపమే వెగడ ◆ నేర్తును నిష్ఠురవాక్పరంపరన్. ౧౬

సీ. చి త్తమా యాదరా◆య త్తమై గ్రాలదు, పా త్రమాయాదరా◆వృ త్త మగుటఁ
గరము విచక్షణా◆కరములు గానియు, క్కరముల వ్రాయు నా◆కరము లెపుడు
పాదము ల్గర్కశ◆పాదకంటకశిలా, క్షోదముల్ యాతనా◆పాదము లగు
దేహంబు రోగసం◆దోహంబుబలిమి మం, దేహంబు బ్రమకె సం◆దేహ మగును

తే. ఇట్టినను బోఁటిమానిసి◆కెట్టులొదవు, విబుధహృదయంగమాలాప◆వివిధచతుర
నటన ఘటనాపటు స్ఫుట◆కటకపటల, క్రమఝుళంఝుళారావ◆కావ్యకన్య. ౧౭

సీ. సరసుల సద్గోష్ఠిఁ ◆ దిరిగెడు కవిరాజ, హంసలఁ బదరాగ ◆ మరుదు గాదు
విబుధులసంగతి ◆ విహరించు రుచివిధా, శుకవుల నొప్పారు ◆ శుద్ధసూ క్తి
బహుళభోగాభోగ◆పటిమనైన యహీన్లు, డోపెడి బహురీతు◆లొప్పఁ బలుక
విషయానుభవయుక్తి◆వెలసెడివారికి, భావజాత్యున్నతుల్◆పలుక సుళువు

తే. కంజదృక్కంజలోచనా◆కంజరేద్ధ, మంజుమంజీరశింజాన◆పుంజ మింటఁ
బుంజిగొనియున్నభోగముల్◆పొదలుచున్న, లలితకవితావిలాసిని◆యలరుటరుదె?

సీ. కలమెత్తివ్రాయంగఁ◆గడఁగితినా గ్రామ్య, వచనభూయిష్ఠంబు◆వ్రాయసంబు
వీను లొగ్గి యొకింత◆వినియెద నందునా, బండుబూతులె చెవి◆నిండుచుండుఁ
గన్నులు విచ్చి నేఁ◆గనుఁగొందునందునా, కంటకతరుదరు ◆ ల్గానఁబడును
స్వచ్ఛందవృ త్తిని◆జరియింతు నందునా, ధర నాథవంతుఁడఁ◆దిరుగ రాదు

తే. కాన నావాన నసమాన◆మానభాస, మానసదరీణవర్ణనా◆మాధురీణ
భావనాసూనసూన్నసం◆భావనార్హ, శారదాదేవి యెటులుండు◆సంతసమున. ౧౯

వ. కావ్యరచన దైవపూజావిశేషంబుగ మనీషులు భావించుటఁ గృతికృత్యంబునఁ గృతకృత్యుండ నయ్యెద నని తలంప నయ్యది పూర్వకృతాపూర్వసుకృతాధిక్యంబునంగాని నిరంతరాయంబుగఁ గొనసాగనేర దని సందేహమందె యుండనై డోలాందోళితమానసంబున నెయ్యదియుం దోఁపమి శ్రీరామధ్యానంబు సలుప నెయ్యది హృదయగోచరం బగు నద్దానిం గరణీయంబుగ నాచరించెదఁ దత్కరుణానిపన్నంబులనేకంబులు హృద్గతంబు లయ్యు జంకనేలయని దృఢచిత్తుండనై శ్రీరామ సాన్నిధ్యంబుఁ గల్పించుకొని నర్ధనిమీలితలోచనుండనై ధ్యానించుచున్న సమయంబున. ౨౦

సీ. రాహుగ్రహాస్యని◆ర్గళదబ్జమండలం, బన నొప్పు నెమ్మోము◆హాసవృతోడ
గ్రీష్మసాయాహ్నసం◆దృశ్యమానం బగు, తనులతఁ దనులత◆దారసింప
నవహిమాత్యయవేళ ◆ నలివాయుకంజాత, ముల కన్నుకన్నులు◆పురుడుచూపఁ
గానకృత్రిమ◆గర్తవినిర్గత, కరిణినా నిజ యాన◆కలన మమరఁ
తే. జెలఁగికుఱుమాపుచీరకు◆చ్చెళ్లు గునిసి, యాడమీఁగాళ్లఁ, గొనగోళ్ల◆ననువుపఱిచి
చెదఱువెంద్రుక; లొయ్యనఁ◆జేరవచ్చి, నిలిచె నొకలేమ మామక◆నికటసీమ.
వ. ఇట్లు మదీయోపకంఠంబుఁ జేరినయక్కులకంతి నుపలక్షించి. ౨౨
ఉ. ఆవిరి గప్పగా మినుకు◆టద్దమొకో, నునుమంచు సోఁకి పోక్
వావిరిఁ దాఁకి తేఱు సిత◆వారిజమొక్కొ, దినాంతవేళలన్
బోవుచునుండ నెండ పరి◆పూర్ణసుధాకరబింబమో, యనం
గా విరిఁబోఁణినెమ్మొగము ◆ కారణమేమియొ నాఁడి తేఱెడిన్? ౨౩
సీ. దయ నాకు సిరు లీయ◆దయచేసినట్టి యా, లచ్చియందునొ మేను◆పచ్చగాదు
పద్యముల్ నానోరఁ ◆ బ్రౌఢిమైఁ బలికించు, వాణినాఁ బుస్తక◆పాణి గాదు
జగతి భక్తులఁ బ్రోచు◆నగజాత యందునా, రుదురాకవేరు పే◆రెదను లేదు
మదనమోహిని యని ◆ మదిలోనఁ దలఁతునా, చిత్తవిభ్రమ మెప్డు◆చేరదు నను
తే. మహినిమహిళయందిట్టి◆మహిమయున్నె? వేల్పుఁగన్నియ కెట్టులీ◆వెతలుగలుగు?
ననుచుఁదలపోసి యిట్లంటి◆నతివతోడ, నైజమగుగురుభావంబు◆నయముమెఱయ.
ఉ. ఎవ్వతెవమ్మ నీవు? కత ◆ మేమి యొకో యరుదేర? నీమదిన్
నెవ్వగ గూరియున్నగతి ◆ నీదుస్వరూపమె చెప్పెడుం గటా
నొవ్వఁగ నేరు పల్కురి ని◆నున్? నను ధన్యునిఁ జేయు తెల్లనా
గువ్వలయెక్కురింతగల◆కొమ్మవొ? యమ్మవొ తమ్మిచూలికిన్? ౨౪
వ. అని తనయమానుషం బైన తేజోవిశేషంబుకతన భయభక్తి సంభ్రమంబులు ముప్పిరిగొనమోడ్పుఁ గేలునమిగుల మాటాడనేరని నన్నుఁగనిసాదరంబుగ నాయంబ యిట్లనియె. ౨౫
తే. అన్న! కన్నులవిల్తుని◆యన్నయన్న, గాఁగ నన్నెన్నమీనిన్నుఁ◆గానఁ గాను
ముచ్చటైనను వచ్చితి◆ముచ్చటింతుఁ, గలదు నాదీనదశకును◆గారణంబు. ౨౬
ఉ. మాసరచింత లొంది విష◆మవ్యసనావిలచిత్త నౌట సం
తోసములేని నెట్లు పరి◆తోషముకల్మిఁ జరింతునో? యనా
శ్వాసితదుఃఖితే మనసి ◆ సర్వ మసహ్య మటన్నపల్కు వి
శ్వాసము గాదె? శోకసమ◆శాత్రవుఁ డుండునె వేఱొకం డిలన్. ౨౭

తే. ఆరురుక్షుండు క్రోధంబు ♦ నణఁచుభంగి, నబ్ధిబడ బాగ్నిఁ దనలోన♦నాఁచినట్లు
లాఁపిమదిలోన నాదుదు♦రంతచింత, నవనిపైఁ బుత్ర! యిటు నడ♦యాడుదాన.

ఉ. ధారిణిఁ గృష్ణరాయలు తు♦ద న్గలయాంధ్రరసాధినాథుల్
గారవమార నన్నుఁ గనఁ♦గా ఘనగౌరవవృత్తి నుంటిమ
న్నీరస నిప్పు డన్యగతి ♦ నీరస మొప్పఁగఁ జూడ నాప్రజల్
నీరసరూప మొప్పె ధర♦ణీసురసత్తమ! యేమిచెప్పుదున్. ౩౦

తే. ఆంధ్రనాథునిపాలితం♦బైనయట్టి, యంధ్రదేశంబునందలి♦యాంధ్రులెల్ల
నాదుతనయులఁగా నెంతు♦మోదమొప్ప, నాంధ్రభారతి నే నౌట♦నవనివిబుధ.

కం. రాజన్యులచేఁ బూర్వము, పూజలుగొనువారు నాదు♦పుత్రకు లయ్యో!
రాజుల సేవకు లగు ని, స్తేజులఁ గొలిచెదరు నేఁడు ♦ దీనత్వమునన్.

వ. అదియైనను సజ్జన సేవయా యందు వేని. ౩౩

కం. అధములు మతిగుణవిద్యలఁ, గ్రుధ సాదుల నేఁచ బ్రహ్మ♦కొడుకులు సుమి వా
రధికారులు గావుననో, యధికారులుగాఁ జరింతు♦రనుజీవులకున్. ౩౪

చ. కలుకువిలోకనంబుల నె♦గాదిగఁ జూచు, హసించు, నంచునన్
గొలిచినవారిఁ గాంచి కొలు♦కున్ రదముల్, నగుఁబాటుఁ జాటఁగాఁ
జులుకన నాడు, వ్రాయు, మఱి♦చూచును, లేచును దాఁప నిద్ది హా!
యులవగుసన్నిపాతగుణ♦మో, యధికారపిశాచవేషమో. ౩౫

సీ. ధరణీప రాగంబు♦ధరణీపరాగఁబు, నమ్మినతిరుగఁగరాదు♦సుమ్మి పతులఁ
బతిమహోదరము ల♦ప్రతిమహోదరములు, తబ్బిబ్బులౌ మది♦నుబ్బె నేని
వరచంద్రహాసఁబు♦వరచంద్రహాసఁబు, మెలఁకువ గలిగియ♦మెలఁగవలయు
నధికారకౌచితి♦యాధికారకచితి, దూరఁబునందె తాఁ♦దొలఁగవలయు

ఆ. బలుకరాదు నిజముఁ♦బలుకక పోరాదు, పోవరాదు మించి♦బుద్ధినుంచి
చిక్కనేని మిగులఁ♦ జిక్కులనిడుదురు, కూళజనులకొలువు♦చాలబళువు. ౩౬

కం. కష్టములఁ బడుటను నా, యిట్టిరు లగుపట్టు లేమి♦యెంతచదివినన్
గుట్టుగ నున్నా రకటా, గట్టిగ ననఁ బట్టులేమిఁ ♦ గదుకొని కావన్. ౩౭

కం. ఈవిధి శ్వవృత్తిఁ దిరిగెడి, సేవకులే గాక మఱి య♦శేషజనఁబుల్
నావలను చూడ రోసిరి, నే వగచెద దాని కేదను♦నిరతముఁ బుత్రా. ౩౮

కం. అంసం బగుకొలజాబిలి, ముందలఁ గద మెఱయు నాకు♦మును వెప్పుడు, నేఁ
డెందెందుఁ జనిన మెడపై, నొందెందఁ గద యర్ధచంద్ర♦యోగం బకటా. ౩౯

సీ. నాపుత్రులే న న్న♦నాదరించుటఁ జేసి, యాహారముల మీఁది♦యాశ లేదు
నాకుఁ గూర్చునుతాళి♦వీక నుండమిఁ గాంచ, నగలు మైఁ సవరింప♦వగపుకలుగు

శతవాడపరు లైన♦హరవాదులను గన్న, నగ్గిలేకయే కద్పు♦భగ్గు మనను
దామసంబుల రేగి♦తమలోనఁ గలహించు, తనయులఁ గన్నది♦మనము పొగులు

తే. నాయనా! యేమియందును♦నాయవస్థఁ, బొలిచెడలగడ యగుచు నా♦పుస్తకంబు
కొమరువీణియ చేయూఁత♦గోలయయ్యె, సుతసమూహంబులిటు సేయ♦నుబ్బరాయ!

తే. కురుల వైనను లెక్కింపఁ♦దరముకాని, యలవిగాదయ్య నాపుత్త్రి♦కుల గణింపఁ
బరఁగఁదలవెంట్రుకలయంత♦బలఁగముండిఁ, దలకుఁబోసెడి దిక్కేది♦కలఁపఁబుత్త్ర.

తే. ఆంధ్రు లెల్లెడ నన్యక♦ళాభిరతిని,
గులముఁ గులవిద్య మఱవఁగఁ♦దలఁచి తలఁచి
వెతలు గుడుచుచు నే నున్న♦విధము గాంచి,
తెలుఁగురాయఁడు జడమయ్యె ♦ దిగులు చెంది. ౪౨

చ. కరము వసంతకాలికవి♦కస్వరచారుపిక స్వరైకభా
స్వర మగునాగళస్వరము ♦ సంతతముం బస మేళనంబుగాఁ
బరఁగెడి, నేఁడు మందమయి♦భాసిల దయ్యె నుఖేతరస్థితిన్
వరలెడివార లేడఁ? బ్రతి♦భాయుతవాక్కు శలత్వ మేడనో? ౪౩

చ. తలఁపఁగఁ దాలమూ వదన♦తాలమె, మూర్ఛన గాంచె మూర్ఛ నిం
పలరఁగఁ జేయఁజాల్లయ ల♦యంబును బొందెను, గ్రామ మక్కటా
చెలఁగెను గ్రామపర్యటన♦శీలత, నాదు తనూరుజావళుల్
వెలచెలి పాంసుజావళులు ♦ విశ్రుతిఁగాంచె మహోన్నతస్థితిన్. ౪౪

తే. మదిని నన్నింత తలఁచెడి♦మానవుండు, గానరాఁడయ్యెఁ గొన్నాళ్లు♦గాన నేను
మూర్ఛలనుస్రుక్కి సంచార♦ములనుదక్కి, మూపుచెడియుండితినిజమ్మి క్రూరదశను

కం. అటుపిమ్మట నటమటఁ గవు, లటనిట మహదాశ్రయంబు ♦ లలవడ కున్నన్
వటియింపకుండఁ బిమ్మట, ఘటియించుచుఁ గావ్యములను♦గాచిరి నన్నున్. ౪౬

కం. తక్కినవారికి నే ననఁ, గ్రక్కినకూడైతి నేమి♦కర్మమొ? యిది నీ
కొక్కింత దెలియఁ గద నా, కెక్కుడిముద మొదవు, సొగసు♦లేటికి నింకన్.

చ. కనదురుబంధబంధురము♦కావ్యమటన్నను రజ్జుబంధమా?
యనుదురు; సద్ధ్వను ల్ఘనము♦లంచు వచింపఁగ గంగజాతరా?
యనుదు; రలంకృతు ల్బహుళ♦మన్నను ద్రాటనుగూర్చి కట్టెనా?
యనుదురు! నేఁటియాంధ్రులహా♦హా బవిసాతెఁ దెలుంగుబాసకున్. ౪౭

కం. చదివినమూర్ఖుని కంటెను, జదువనిమూఢుండు మేలు♦చర్చింపఁగ దు
ష్పదముల నన్నుం ద్రిప్పెడు, చదివినమూర్ఖులను వశమె?♦చక్కంబెట్టన్. ౪౮

కం. మార్గం బెఱింగియుఁ గడు దు, ర్మార్గంబునఁ జనుటకన్న ♦ మానమె మేలౌ
దుర్గంధసుమముకన్నను, నిర్గంధసుమంబు మేలు ♦ నిక్కం బరయన్. ౫౦
సీ. పాదముల్ దీర్ఘముల్ ♦ ఛేదింపవలె నండ్రు, నాకు విశ్రమ మేల ♦ నడవ? నండ్రు
కొంఱసున్నమునవీడఁ ♦ గాదువ యేమిట? నండ్రు, వర్ణసంకరవృత్తి ♦ వలయు నండ్రు
సద్వృత్తిరీతులఁ ♦ జాలసంకట మండ్రు, సద్ధ్వనుల్ దలయేరు ♦ సలుపు నండ్రు
శృంగార మేటికిఁ ♦ జీఁదఱకా? యండ్రు, ప్రౌఢోక్తు లతిగూఢ ♦ భావ మండ్రు
తే. వరశకుంతల ముద్దిచ్చి ♦ వఱలె ననఁగ, బల! సకుంతల ముద్దిచ్చి ♦ బడలె నండ్రు
నేఁటి నవనాగరకకవుల్ ♦ నూఱి దప్పి, పద్యనియమంబు నందునా ♦ భాసులగుచు.
సీ. బంధము ల్వ్యాకృతి ♦ బంధంబు లండ్రు శృం, గారంబు లెల్ల వి ♦ కార మండ్రు
గర్భంబు వేదనా ♦ దుర్భావ మని యండ్రు, మధురతాదులరుచి ♦ మధ్య మండ్రు
వాక్యచాతుర్యంబు ♦ భావవక్రత యండ్రు, యమకంబు దుష్పథ ♦ గమక మండ్రు
బహువిధాలంకృతుల్ ♦ భారమాత్రం బండ్రు, ప్రాసయోగంబు బీ ♦ భత్స మండ్రు
తే. వరపదన్యాసకుశలుని ♦ బంగు వండ్రు, చిత్రకవితావినోదంబు ♦ ఛీ యటండ్రు
మత్సపత్న్యపలాలిత ♦ మత్తనయులు, భవ్యధీదీర్ఘదర్శితాఽ ♦ భావు లగుచు ౫౧
సీ. ప్రత్యక్షరశ్లేష ♦ పటిమచేఁ జెన్నారు, వాసవదత్త కే ♦ వాసి తఱిఁగె?
యమకంబు నిండారఁ ♦ గొమరైనకాళిదా, సునళోదయమున కే ♦ సొబగు దప్పె?
గూఢభావనిగూఢఁ ♦ గూఁడికర్కశవాక్య, భరితనైషధ మెట్టి ♦ వన్నె వాసె?
సకలకవిత్వకౌ ♦ శల్యంబుఁ జూపిన, మాఘున కేయవ ♦ మాన మొదవె?
తే. గటకటా! యింతదలఁపక ♦ కుటిలయుక్తిఁ, దేరతేరకు నాదుకు ♦ మారకులను
దూఱుచుందురు బహువిధ ♦ దోషములను, దీని కేనేమివచియించు ♦ దానఁ జెపుమ?
ఉ. సాధులుగాని వెక్కులుల ♦ జల్పితముల్ గొని జాతివాక్యముల్
గా ధరశేసుపర్వ! కృతి ♦ గా నొనరించిన లెస్స యండ్రు; దు
శ్శ్రేధను నట్టిఁడౌకవికి ♦ మేలిధనంబు లొసంగుచుంద రౌ
రా! ధనికుల్; మదీయగతి ♦ యయ్యయొ యెంతకు వచ్చెఁ జూచితే. ౫౪
తే. నేను దుర్దశఁ జెందిన ♦ దాన ననుచుఁ, బ్రౌఢకవితల నావృద్ధి ♦ దరఁగదనుచు
రచ్చకూఁత లెబిగులసా ♦ రస్య మనుచుఁ, బలుకుచుందురు మితిమీఱి ♦ బవిసిమాలి.
తే. శబ్దశాస్త్ర నిషిద్ధోక్తి ♦ సాధువగును, వినఁగను వినోదమైయుంట ♦ ననెద రేని
రతిసుఖంబునకై యంకు ♦ హితమొసలుప? సిరులకొఱకునుజౌర్యంబు ♦ చెల్లునొక్కొ?
మ. ప్రతిశబ్దంబు మథించి దానఁ గలసా ♦ రస్యంబునుం జూచి య
ప్రతిమానూనవిలాసచాతురి రహిం ♦ పన్ సౌష్ఠవస్ఫూర్తిమైఁ

కృతిరత్నంబు ఘటింప భాష నవసు♦శ్రీకాంతి శోభిల్లఁ గా
క తలంపం బొడిజల్లిమాట లన నె♦క్కాలంబున న్వృద్ధిరా. ౫౭

ఆ. వాక్యసరణి వేఱు ♦ భావకౌశల్యంబు, సరణి వేఱు; రెంట♦సరస మైన
కవిత కవితగాక ♦ కడమ యేదైనను, సుకవు లెంచఁబోరు♦శుద్ధ మనుచు. ౫౮

కం. పామరతతికై వ్రాసిన, సామాన్యపుఁగథలు ప్రకృతి♦శాస్త్రము లుండన్
సామము సుళువై; నగరే, ధీమహితులు కావ్యములను♦దీర్చిన నట్టుల్? ౫౯

తే. చాలనరులకు లెస్స పాం♦చాలి సుమ్ము, తఱచుపురుషోత్తములకు వై♦దర్భి లెస్స
యార్యజనులకు గౌడి సౌ♦ఖ్యంబుఁ గొలుపు, లోకులిల భిన్నరుచులౌట♦ప్రాకటంబ.

చం. తలఁపకు చిత్రబంధకవి♦తల్ రచియింపఁగ రాదటం చెదన్
సలలిత కావ్యసంఘటన♦సారసనేత్రనమస్య గాదె? ని
శ్చలసుమనః ప్రకల్పితబి♦సప్రసవాదికరూపపద్యముల్
నలిననివాసినీహృదయ♦నాథున కప్పనసేయ దోషమే?

ఉ. కావున వీరివారివలెఁ♦గాని పథంబులఁ బోకు మయ్య! నన్
ద్రోవలు దప్పఁ ద్రొక్కుచును ♦ చొందర పెట్టకు మయ్య! పూర్వ లే
త్రోవను బోయి రా తెఱఁగు♦దోషము లెంచకు మయ్య! నేర్పుమై
భావన సేయ వయ్య! బహు♦భంగుల నీకు యశంబు చేకుఱున్. ౬౧

వ. అంతరాయభయంబునను భిన్నదర్శను లగులోకుల నెల్ల నెట్లు మెచ్చింప వచ్చు నని యు జిచ్చవడి యున్న నిన్ను హెచ్చరింపఁ జనుదెంచితి. లోకంబునంతయు నేకాకృతి మెప్పింప దైవంబు వలనఁ గాదన నీ వన నెంత. కావున నిర్భయుండవై యుత్సాహంబు వాటించి నిరాఘాటంబుగఁ గృతిఁ బ్రారంభింపు మని దయాపోషణ మనస్తోషణ చింతాశోషణ శంకావేషణ మృదుమధుర భాషణంబుల భాషా యోషారత్నంబు సంభాషించి తిరోహితయైనఁ దెలిసి యది యమ్మహాదేవి యల వోకగాఁ దలంచి. ౬౩

కం. చింతామణిరూపిణివై, చింతామణివేదికపయిఁ♦జెలువలరెడు శ్రీ
కాంతామణి! భక్తోత్కర, చింతామణి వనుచు వినుతి ♦ చేయుదు వాణీ. ౬౪

కం. భళిరే! త్వన్నామా ప్తిని, దళమే నిర్వక్రవాగ్వి♦ధానక్షమవహఁ
దలమే త్వత్కరుణాకం, దళ మేనదు సోఁకు నట్టి ♦ ధన్యునిఁ బొగడన్? ౬౫

ఉ. నీరజపీఠవాసరమ♦ణీ! రమణీయమణీమయోద్ధమం
జీరకకింకిణీనికర♦శింజితఝూళఝుళంఝుళార్భటుల్
దోరముగాఁగ నిస్తులిత♦ధోరణి మీఱ నవారణంబుగా
నా రసన న్నటించుచు ఘ♦నంబుగఁ గూర్పఁగదమ్మ శ్రేయముల్. ౬౬

మ. ననయుల్ పూర్వకవీశు లాడని వచశ్చాతుర్యమా లేదు; నే
జననీ! వచ్చియు రాక యాడిన మహిష్ఠప్రీతి యొప్పార నో
య్యనఁ ద్వత్కంఠగభవ్యకావ్యసుమణీహారంబునం గ్రిందునై
కన నొప్పారుతకంబుచందమున మత్కావ్యంబు లాలింపవే. ౧౬

వ. అని ముకుళితకరుండనై యమ్మహాదేవిం గూర్చి నమస్కరించి హర్షపులకిత గాత్రుండనై దశకంధరమదసింధురవరసింధురపరమేచకకంధరాంగ సమర్పితంబైన మామకీన ప్రబంధంబు గుణబంధురపదధురంధరంబై వసుంధర నమంథరగతిఁ గవియుగంధరహ్లాకరం బగు నని తలంచి మదీయాత్మారాముఁడగు శ్రీరాముని శుద్ధాంతరంగ శుద్ధాంతరంగసంగతుం జేసి మోక్షఫలాపేక్షఁ దత్కమలాక్షు స్మత్కృతికి నధ్యక్షుఁగాఁ దలంచుచుఁ దదుచితకథాన్వేషణపరుండనై యున్న సమయంబున. ౧౭

కం. మాయమ్మ కనికరమ్మున, మాయమ్మయు, యవగుణంబు మాయమ్మగుఁ జు
మ్మాయమ్మయందు, నడవడి నాయమ్మిక, నమ్మిక మ్మయమ్మ గుణమ్ముల్. ౧౮

కం. కనకమ్మ సద్గుణంబులఁ, గనకమ్మ మదాళిలకును గనఁ గమ్మతెఱం
గునఁ గొమ్మలలో వెలయుటఁ, గనకమ్మ యనంగఁ గాంచె ఘనవిఖ్యాతిన్. ౧౯

ఉ. అయమ యొక్కనాఁడు భరతానుజరామసమేతరామమా
యో యన డాయవచ్చి తనయుల్ దనయుల్లముఁ బల్లవింపఁగాఁ
జేయు విధేయులై స్నుషలు చేరువఁ జేర వినోదవైఖరిన్
హాయిగ ముచ్చటించెను సమంచితపుణ్యకథా ప్రసంగముల్. ౨౦

వ. వారెవ రెవ రనిన నేనును నాయనుజుండు. ౨౧

ఉ. రంగనయాంతరంగమె హారంగని స్నేహితు లెల్ల మోద మూ
రంగన, వేంకటేశపదరంగనటన్మతియై మనీషిసా
రంగనయప్రసంగ మలరంగ నయాంగవిధిజ్ఞుఁడై నమా
రంగన; సాటి వానికి ధరం గన సాధుగుణానుషంగునిన్. 23

ఉ. పూతయశోవిశోభితుఁడు భూనుతకంచనపల్లి వంశవి
ఖ్యాతుఁడు నాదుమామ ధృతికిల్మిషహృన్నళినీసమర్చిత
శ్రీతరుణీశపద్యుగకుశేశయ వేంకటసుబ్బరావు శ్రీ
సీతమ వీరియాత్మభవశిష్టపణాయితశీల రంగయున్. ౨౪

వ. నా మఱఁదలు. ౨౫

ఆ. పాలవాయి వంశభవ్యుఁడు గండీరావు, నరసమాంబయనెడు తరుణియందుఁ
బ్రేమఁ గాంచినట్టి రెండవకూఁతురు, రంగమ సుగుణగణరంగమ యన. ౨౬

వ. అట్టి సమయంబున- ౨౭

కం. కనుఁగొనల దయారసము, ల్గునగునలాడంగ నడిమి♦కొమరుఁ డమ్ముగురం
దును గనుఁగొని సుబ్బన్నను, నను సుగుణవతీమతల్లి♦ నాతల్లి యనెన్. ౪౮

చం. తెలియఁగ వింటిఁ బుత్ర! భవ♦దీయపితృవ్యులు పిన్ననాఁటఁ బా
టిలిన మరాటబాసను బ♦ఠింపఁగఁ గోసలరాజపుత్రిఁ దా
నలరుచు బంతిదేర్లయెడ♦యందు వివాహము నాడఁబూన వా
రల కుదయించు వెన్నుఁ డని ♦ రావణుఁ డుర్వి వెస వారి నేఁచుటల్. ౪౯

కం. వినిన స్త్రీవాకథల, న్వినిపింపుము నాయనా! స♦విస్తరముగ నా
విని యెఱుఁగ నేను దల్లి! మును దీని నదెట్లు పలుక ♦ మొనయుదు ననినన్. ౫౦

తే. రాదుగా నాకు నా మహా♦రాష్ట్రభాష
పెద్దకాలంబు నందలి ♦ వినికి గలదు
దాన దిఙ్మాత్ర మెఱిఁగించు♦దానఁ గొంత
బుధులవలనను దెలియుము ♦ పూర్ణముగను. ౫౧

వ. అని యించుకించుక వచించుటయు నిట్టి నిస్తులప్రశస్తకథా ప్రపంచంబు సమస్తంబు సవిస్తరంబుగ నెఱుంగ బద్ధదీక్షుండనై విచారించుచున్నాడ. ౫౨

సీ. శ్రీరామచంద్రప♦దారవిందార్చనా, నిస్తులశేముషీ♦నిధి యెవండు
ప్రాకటలంకల♦పల్లెసద్వంశస, న్మహనీయమౌక్తిక♦మణి యెవండు
ద్రావిడహూణాంధ్ర♦దేవభాషాదివి, ద్యాభాషావిధిజ్ఞ మ♦నీషి యెవఁడు
ధీరవీరాసామి♦సూరిప్రమోదవ, ర్ధనశీలశీతల♦ధాముఁ డెవ్వఁ

తే. డట్టివేంకటసుబ్బార్యుఁ♦డార్యహితుఁడు, గోర వాల్మీకునకు మున్ను♦నారదుండు
పోలె నెఱిఁగించి పెరరేచెఁ♦జాలఁగనను, రమణ నీకావ్యవిరచనా♦రంభమునను. ౫౩

వ. ఆయనకు. ౫౪

ఆ. కులము దానితోడు ♦ చెలువారెఁ బాండితి
వన్నెదెచ్చె రెంటి ♦ కెన్నగుణము
పోఁక లాకు లున్నఁ ♦ బొలుపారఁ దాంబూల
మునను వన్నె నున్న♦మునను గాదె. ౫౫

## అయోధ్యాపురీచరిత్రము.

మ. ప్రాజ్ఞగ్రామణి యాతఁ డిట్టులను సా♦భ్రాత్రంబు పెంపార నో
విజ్ఞానప్రియ! పుణ్యతీర్థములు సే♦వింపంగ మున్నే మహా
విజ్ఞుల్ దోడయిరాఁ జరించు నెడలం ♦ బ్రీతిం గనుంగొంటి రా
మాజ్ఞం బాలితమై రహించిన యయో♦ధ్యన్ దేవతారాధ్యనున్. ౫౬

తే. ముక్తిదాయకపట్టన • ములను మొదలఁ
గొలువఁబడు నెద్ది యపరవై • కుంఠ మెద్ది
చూడఁజూడఁగ మఱియింత • చూడఁజూడ
వలయునని యాస నెయ్యది • గొలుపుచుండు. ౮౭

వ. అట్టి యయోధ్యాపురి చరిత్రం బించుక వచించెద విను మని యిట్లనియె. ౮౮

కం. శ్రీరాములు వైకుంఠముఁ, జేరం జనుటయును బిదపఁ • జిత్రము! సరయూ
నీరము లయోధ్య ముంచిన, వారావృత మగుట విన్న • వాఁడవుగావే. ౮౯

కం. ఆపగిదిని బహువర్షము, లాపగనీట న్మునింగి • యవిదిత మయి యి
ట్టాపురి చెలంగ నుజ్జయ,నీపురవల్లభుఁడు సర్వ•నీతిపరుండున్. ౯౦

ఉ. ఖండితశాత్రవోత్కరుఁ డ•ఖండపరాక్రమశాలి క్షోణిపా
ఖండలమూర్తి సర్వనవ•ఖండయుతావనిమండలప్రజా
మండలరక్షణాత్తశుభ•మండనకీర్తివిహారి విక్రమా
ర్కుండనుధారిణీశుఁ డొక•రుండు రహించెఁ గదా యతం డెదన్. ౯౧

మ. సకలోర్వీస్థితదైవతీర్థనగరీ•సందర్శనోత్సాహియై
యకలంకప్రతిభావిశేషమున ది•వ్యక్షేత్రతీర్థాపగా
నికరాటీకనలోలుఁడై చనుచు న•న్వేషించె నిద్దానికై
యకటా! రిత్తశ్రమంబె గాని కనలేఁ•డయ్యెం బురీరత్నమున్. ౯౨

తే. శాస్త్రచోదిత మైనట్టి•స్థల మదెల్ల, జలమయంబయి యుండుటఁ•జాలవగచి
తెలిసి పెద్దలవలనను•గలతెఱంగు, ధైర్యనిర్జితకాంచనా•హార్యుఁ డపుడు. ౯౩

కం. ఏతాదృశ మగుక్షేత్రము, భూతలమునఁగానకుంట•పోలునె? జనతా
పాతకనిపాతనార్థము, ఖ్యాతి యొసంగినను మృత్యు•వైనను మేలౌ. ౯౪

కం. అని నిశ్చయించి నారా,యణుఁగూర్చి తపస్సమాధి • నతినిష్ఠఁ జరిం
చినఁ బెక్కుహాయనంబులు, జనపాలునిఁ జూచి శౌరి • సదయుం డగుచున్. ౯౫

వ. భవదీప్సితంబెయ్యది? వేఁడు మనుటయు దేవా! భవదీయరామావతారంబున నయో
ధ్య యెట్టులుండె నట్టివిధంబున లోకంబునకు న్గోచరింప వరం బొసంగవే యనవుడు.

కం. శ్రీకాంతుఁ డిట్టు లను నో, భూకాంత! త్వదీప్సితంబు•పొసఁగ దొసంగన్
ఈకాంక్ష విడువు మనఁగ ర,మాకాంతునితోడఁ బల్కు•మానవవిభుఁడున్. ౯౭

కం. అసువుల నైనను నీ కిదె, యొసఁగెదనే కాని విడువ•నోర్తునె కోర్కెన్
వ్యసనం బైనను రానీ, యస మైనను గాని విడువ • నాశయ మనినన్. ౯౮

మత్త. అంత సాహస మేల యయ్య ధ•రాధిపా! విను మొండు నీ
స్వాంతపీఠిని జూడ నెయ్యవి • యాశచేసెదొ యట్టిచో

క్లైంతయుం గన నిచ్చ నించుక • యిచ్చగించిన నీధునీ
కాంత నా జనపాలవర్యుఁడు • కాంక్షచేసెను గొన్నిటిన్. ౯౯

వ. అవి యెయ్యవి యనినఁ గైకయీకోపభవనంబును, శ్రీరామజననస్థలంబును, గాంచన సీతయు, గోప్రతారం బనురామనిర్యాణఘట్టంబును, హనుమాన్గడియు, నాగేశ్వ రాలయంబు ననుకొన్నిప్రదేశంబులు నేఁటికిని దృశ్యమానంబులై విక్రమార్కుయ శస్తంభంబులుం బోలె నొప్పుచున్న యవి. వానివెంపుసొంపు వర్ణింప వలంతినే యని మఱియు. ౧౦౦

కం. అచ్చోట్లు విడిచి సరయువు, విచ్చేయుటకతన నేఁడు • వీక్షింపఁగనౌ
నచ్చపుఁజందురరేకన, మెచ్చులుగొలుపుచుఁ బురీస•మీపమునందున్. ౧౦౧

తే. స్వామినిర్యాణఘట్టవీ•క్షణముచేతఁ, గనుల నీరూర కుండినఁ•గాఁడు నరుఁడు
కైకయీకోపభవనవీ•క్షణముసల్పి, యామెఁ దిట్టనిమానవుఁ • డవని లేఁడు. ౧౦౨

ఉ. క్రాలెడినెట్లు కాశి మణి•కర్ణిక, యుజ్జయనీపురిన్ మహా
కాళనికేతనం బెటులు • ఖ్యాతివహించెనొ, నైమిశాటవిన్
వాలెముఁ జక్రవాపి యెటు • భ్రాజితకీర్తిని, న ట్లయోధ్యఁ దీ
ర్థాళుల నుత్తమోత్తము•నై శుభదం బగు గోప్రతారమున్. ౧౦౩

ఉ. వేలుపుటాలపాల నగు•వెల్లియొ? కాదు; ద్రవించిపాఱు తా
రాలలనామనోహరుని•రశ్మలరాశియొ? కాదు; సత్సుధా
జాలమొ? కా దిఁకేమనినఁ • జారుతరం బగుక్రొత్తముత్తెపు
న్లీలలతేట గావున ఘు•ఏజలముల్ సికతాళి తారచూ
ర్ణాళి గతిన్ గనంగ నగు • సందు నమేయపు లోఁతు గల్గియున్. ౧౦౪

కం. కాంచనజనకాత్మజ రేఁ, గాంచఁగ నగుఁగాని పగలఁ • గనరా దెటులే
నెంచఁగఁ దరమా సీతా,చంచలనయనామరీచి•సంపత్తతులన్. ౧౦౫

కం. రంగగుహారతి సీతా,మంగళదేవత కొనంగ • మణిగణదీప్తిన్
బంగారొడలయినం దమ,యంగంబుల మఱచుచుందు • రయ్య దిదృక్షుల్. ౧౦౬

మత్త. వేయిగన్నులు గోరెతిం బృథి•వీసుతం గనువేళల
న్వేయిజిహ్వలఁ గోరెతిం ధర•ణీసుతన్ వినుతింపఁగా
వేయిశిర్షము లాసచేసితి • వెండి ధ్యానము చేయఁగా
వేయు నేటికి జన్మమేటికి • వేదిజం గనకుండినన్. ౧౦౭

కం. హనుమాన్గడిని విచిత్రము, వినుమా వివరింతు వినఁగ • వీనులవిందౌఁ
గన మానస మలరదొకో, ఘనమానపువానరాళి• గల దచ్చోటన్. ౧౦౮

కం. అటవీచరాళికొఱకై, విటపులదట్టంబునైన • విపినమె గల ద
చ్చట నుండు మొుఁడితోఁకలఁ, జటులతరాకారములను • శాఖామృగముల్. ౧౦౯

చం. అసమానప్రతిపత్తి నైన, విపులాహ్లాదంబుచే నైనఁ, బా
యసముల్ లోకులు సంఘటించికొని రాహాండాలతో వానరుల్
విసుమానంబుగ బారుతీరి నియమావిచ్ఛిత్తిమైఁ బోరకే
లసమానం బగురీతిఁ గైకొనెడులీలల్ నిత్యదధ్యోదన
గ్రసనాభ్యాసులు వైష్ణవుల్ గుడిని నేరం జాల రో మిత్రమా!　　౧౧౦

చం. అనఁగననంగ మాటలు తమంతటనే విరమించు; బాష్పముల్
గనఁగఁగనంగ మోదమునఁ గాల్వలువాఱును గంటఁ;దత్కథల్
వినఁగవినంగ వీనులకు విం దయి పొందుగ విస్తరిల్లు; నే
మనఁగ! మనంగనేల నగరాద్భుతలీలలు చూడకుండినన్?　　౧౧౧

కం. రామప్రసూతిగృహముం, గామించి యెట్లైనఁ జూడఁగా నోపినచో
భూమిఁ బ్రసూతిగృహంబును, గామించియ యైనఁ జూడఁగా నోపఁ డయా　　౧౧౨

మ. తతశృంగారకళానిధానసగరీధౌతాబ్జదృగ్గేహినీ
ధృతరత్నాయితమంగళాయతనసుశ్రేణుల్ దగు న్వేటలై;
పతకంబో యన సూర్యవంశభవభూపాలావళీసంతతా
ర్చితనాగేశ్వర దేవతాయతన ముచ్ఛ్రి మించు మధ్యంబునన్.　　౧౧౩

వ. అని వచియించె నిట్లు మదీయజనయిత్రీప్రేరణంబున సుహృదీరితం బగు శ్రీకౌసల్యా
పరిణయకథను బ్రబంధంబుగ రచియింపఁ గౌతుకాధీనమానసుండనై.　　౧౧౪

కం. కారయిత రాముఁ డఁట స,త్సారమతిన్ శ్రోత రామచంద్రుం డఁట నా
నేరమి నేరం బగునే? కారాకూరంబులేల కడఁగెదఁ గృతికిన్.　　౧౧౫

చం. అరయఁగ మత్పురాకృతమహాసుకృతంబు లవెట్టివో యహా!
ధరణిని లభ్య యయ్యె విబుధప్రకరస్తుతమంజువాణి నా
కరుదుగ, దాని నే జనకుఁడై హవణిల్లుట ధారవోసెదన్
వరహితధర్మ దానగుణభాసితకీర్తికి రామమూర్తికిన్.　　౧౧౬

వ. అని తత్ప్రసాదపరిలబ్ధికై యతనిసన్నిధానంబుఁ గల్పించుకొని నుతించెద.　　౧౧౭



కృ తి ప తి ను తి.

తే. ధరణి దోఁగాడుచును బోవఁ దల్లిఁ జేరఁ
గాలుసేతులు డస్సిన నేల బొజ్జ
సోఁకఁగఁ బరుండి తలయెత్తి చూచుచిన్ని
చూపులను నేఁడు న న్నిటు చూడవయ్య.　　౧౧౮

చం. గునగునఁ దప్పతప్పటడుగుల్ చెలఁగం బరువెత్తుచుం దటా
లున మెడఁ గౌఁగిలింప నొడిలో నెగఁబ్రాఁకఁగ ముద్దువెట్టుచు

జ్జనని యిదేమి నాయన! య॰నక మురిపెంబున «నమ్మ! పాయి” యం
చనియెడు ముద్దునెమ్మొగము॰నందముఁ జూపఁగదయ్య రాఘవా! ౧౧౯

చం. మురిపెపుఁజుక్కబొట్టు, నును॰ముంగురులల్లినపింపిణీజడల్
పరఁగఁగ ముద్దుగూర్చు జుర॰పాలును, సొంపగుపాలబుగ్గలు
న్దరహసితంబు, వక్షమున ॰ నాణెపుజందెము నొప్ప మానితో
సరసతఁ దోఁచుఁగూడెచను ॰ చారుతరాకృతిఁ జూపు రాఘవా! ౧౨౦

చం. బుగిలెడు నూర్ధ్వపుండ్రమును ॰ బుగ్గను జుక్కయుఁ, గమ్మవాసనల్
నిగనిగలాడు హారములు ॰ నీ టగుపోఁగులు, వల్లెవాటు, మే
ల్వగగల పచ్చదోవతులు ॰ పాదములం బసుపంటు లత్తుక
ల్నగుమొగ మొప్ప పెండ్లిహొయ॰లం గనిపింపర జానకీశ్వరా! ౧౨౧

సీ. తలఁబ్రాలు దోయుటఁ॰బాల్చియెండొరులను, మీఱు నుత్సాహంబు ॰ మేరమీఱ
శిరమునఁ బోయు వోఁ ॰ గరమునోఁకఁ జెమర్చు, మేనుల నర్తని॰మీలితంపుఁ
గనులఁ బరస్పరం॰బును జూచి చూడక, యగివాణ మది రిత్త॰దగుటమైనఁ
దెలియక కేల్సాఁచి ॰ తెలిసి లోఁ గొదుకుచు, నాస్యబింబంబుల॰నావరింపఁ

తే. బసుపుపొడి హరిదళమూను ॰ పాత్రములన, ననుపమానవిలాసవి॰హారులైన
శ్రీవధూవరులార! మీ॰చెలువుచూప, నాకుసాక్షాత్కరింపుఁడీ॰ననుపు మెఱయ. ౧౨౨

మ. తలఁబ్రాల్ దోయిట దోయిలించి తలమీఁ॰దం బోయుభూపుత్రికో
జ్జ్వలశోభాయుతబాహుమూలములపైఁ ॰ బార్శ్వస్థభామాళిపైఁ
జెలియూరుస్థలిపై సభాసదులపై ॰ సీతాస్యపద్మంబుపైఁ
దెలెపైఁ బాతరలాడుచూపులఁ బ్రసా॰దింపం గదే రాఘవా! ౧౨౩

తే. చెలఁగి యుద్వాహపీఠి వ॰సించువేళ, నూతనాభ్యస్తచౌర్యవి॰నోదములను
నెమరుకోలాడు మీసిగ్గు ॰ కుమురుబెదరు, కలికిచూపుల నామోలఁ॰గులుకరాదె.

మ. దరహాసాంకుర మొప్ప మోవిపయిఁ బ్రో॰ద్యత్కోపరేఖవహ్ని చ్ఛటా
శ్యరుణీభూతము లైననేత్రములతో ॰ జ్యాకృష్టిబద్ధాంగుళీ
వరవిన్యాసముతోడ, భార్గవుని ని॰ర్భర్త్సింప నీవూను ని
ష్ఠురబాణాగ్ని మదీయదుర్గతికిఁ గూ॰ర్చుక్ భస్మసాత్కారముల్. ౧౨౫

చం. అడవికిఁ బోవ కాల్నడ, ర॰యంబునఁ గట్టవ నారచీర లి
ప్పుడ యని కైక వల్కినను ॰ బోణిమి వాసెనె? యశ్రు లూరెనే?
తడఁబడెనే పదాళి? ధృతి ॰ దప్పెనె? యేమియు మోము వాడెనే?
చెడెనె కడంక ? యట్టి యతి॰చిత్రపుఁదాలిమి నా కొసంగరా. ౧౨౬

శా. రామా! రామయ! రామచంద్ర! రఘువీ॰రా! యంచు వాపోవుచు
న్రామాపూరుషబాలకావళులు కాం॰తారప్రవేశోన్మతిన్

రా, మీవెంట గృహంబు నూరు విడి యా•రా వారి వంచించి తో
స్వామీ! మీ వెనువెంటఁ బర్వ లిడుమ•త్స్వాంతంబు నూరార్పవే! ౧౨౭

ఉ. ప్రాణమువోలె నిన్ను నెడఁ•బాయని సత్ప్రకృతిద్ధభార్య, య
గ్లానిని గొల్వ శేషగుణ•లక్ష్మణుఁడుర్, వన మున్కిపట్టుగా
జానగుటం గదా వనికి • సాగితి వర్మిలి; నేవిభూతియం
దేనియు నీకు వేఱు గల•దే విభవంబు వచింపు తత్త్వమున్?     ౧౨౮

ఉ. దాసరితప్పు లన్నియును • దండముతో సరి నాథ! వీఁడు మీ
దాసతఁ గాంచె ని ష్ప్రభయ•దాన మొసంగఁగ న ర్హ మంచుఁ గా
కాసురు సాపరాధుఁ గృపఁ • గావఁగఁ బల్కితి వట్లు వీఁడు మీ
దాసులదాసుఁ డె ష్ప్రభయ•దాన మొసంగెదొ తల్లి! జానకీ!     ౧౨౯

చం. కలుగునటయ్య రామ! ధరఁ•గాంచనవర్ణమృగం? బదేమి ధీ
కలిలమొ; యాస దోస మెఱుఁ•గం గలదా? విను నీదుమాయయే
యలమెనె నిన్ను? ముప్పునిడె • నయ్యలజన్నిద మయ్యవారి కర్
పలుకు యథార్థ మయ్యె నెటు • పాలనసేసెదొ నన్ను మోహితుర్.     ౧౩౦

చం. తెలివి దొఱంగి నీవు దెగి•తిట్టితి వందురు నీమఱందినిర్
దెలియనివారు, రాక్షస త•తిర్ వధియింపఁగఁ బ్రాణనాథుఁడుం
బలికినబాస దీర్ప నటు • పన్ని తుపాయముఁ గాక నీకునుం
గలుగునటమ్మ సీత! యొక•కాలమునర్ భ్రమ మానసంబునర్.     ౧౩౧

తే. దంమ్యులే లేరు నా కని • ధరణితనయ
తన్ను భర్త్సించుదైత్యకాం•తలను మనిచె
శర ణటన్నను బ్రోతు నర్•శపథ మూని
గ్రుడ్డుఁ బెకలించితివి కాకి • గోడుకుడువ
సేవ్యతరు లేరొ మీలోనఁ • జెప్పవయ్య?     ౧౩౨

శా. లీలాలోకనమాత్ర లోకములఁ గ•ల్పింపర్ హరింపంగనౌ
లీలామూర్తి వింపామరు, బలెనె జా•లిం బొంది తేలా కడుర్?
ఏలా క్రోఁతుల నాశ్రయించితివి తం•డ్రీ! కట్టి తావార్ధి? స
చ్ఛీలా! ధాత్రిని గర్మయోగమ యను•ష్ఠేయంబుగాఁ దెల్పనో.     ౧౩౩

ఉ. కర్మము భుక్తమైన మఱి•గాని లభింపదు ముక్తి యన్న యా
కర్మఠవాక్యపద్ధతులఁ • గాఱియఁ జెందితిఁ గాని రామ! నీ
వర్మిలిఁ బక్షిరాజునకు • నక్షయసౌఖ్యము లీయఁ జూచి నే
శర్మద మైనమీదయ క•సాధ్యము లే దని నిశ్చయించితిర్.     ౧౩౪

ఉ. గాటపుభక్తిఁ జిత్తమున ♦ క్ష్మాతనయాప్రమదైక హేతువున్
నాటుచు సేతువున్ దనుజ♦నాయకపట్టనధూమకేతువున్
జీటికిమాటికిన్ హృదయ♦సీమ ధరించి భజింతు నాధను
ష్కోటిని బాపశైలశత♦కోటిని ముక్తివధూటివీటినిన్. ౧౩౫

ఉ. పక్కికి మోక్షమున్ దనుజ♦వానరనాథులకుం బ్రభుత్వము
ల్గ్రిక్కన నీవి నీదయకు ♦ లక్ష్యము లందురు, తేర కిచ్చితే?
యెక్కటిపోరఁ బ్రాణముల ♦ నీయఁ గడంగరె? యేమిలేని యీ
బక్కగువాగుఁబోతునకు ♦ భద్రముఁ గూర్చినఁగాదె సాక్ష్యమా. ౧౩౬

ఉ. తమ్ములు బిడ్డలున్ సఖులు ♦ దానవవైరియ రాముఁ డన్నఁ గో
పమ్మున రజ్జులాడి దశ♦వక్త్రుఁడు నాటఁగ మేను నిండ నీ
యమ్ములు విశ్వతోముఖము♦లై మఱి విశ్వమయుండ వంచుఁ జి
త్తమ్మునఁ జూచె నంత్యదశ ♦ ధన్యత నట్టిది నా కొసంగుమీ. ౧౩౭

సీ. వసుధఁగల్గినమేలి♦నన్నెపుత్తడిబొమ్మ, దానగుణాకల్ప♦ధరణిజాత
రత్నగర్భాగర్భ♦రాజితసురమణి, రామనీలఖచిత♦హేమభూష
దనుజారిరామశ♦తఘ్నికి జానకి, నతపంకప్రక్షాళ♦నచణసీత
నాథవక్షస్స్థలీ♦నవ్యయోజనగంధ, భక్తసంఘాతంబు ♦ పట్టుఁగొమ్మ
తే. దైత్యకులవల్లికాకోటి♦దళనకమల, జనకధరణీతలేశ్వర♦సవనఫలము
మైథిలీదేవి మోక్షసం♦పదలదీవి, నాకు సాక్షాత్కరించుత ♦ నాథుఁగూడి. ౧౩౮

సీ. వాసవమణినీల♦భాసురగాత్రుండు, చారువీరాసన♦సంస్థితుండు
వామజానుస్థిత♦వామకరాబ్జుండు, జ్ఞానముద్రాంకాప♦సవ్యకరుఁడు
మణిమయకోటీర♦మండితశీర్షుండు, శ్రీవత్సకౌస్తుభ♦చిహ్నితుండు
రాణియై జానకి ♦ రాణింప డాపల, శస్తనీరేజాత♦హస్త యగుచు
తే. వెలసి, తమ్ములుఁబావని ♦ కెలనఁ గొల్వ, లోకములనేలు నతజన♦శ్రీకరుండు
రమ్యగుణకీర్తి పట్టాభి♦రామమూర్తి, పాయక వసించు నామనః♦పద్మపీఠి. ౧౩౯

ఉ. అన్న యటంచు నమ్మి పర♦మాపదఁ బాపినతమ్ముఁగుఱ్ఱ న
న్నన్న హొకాలుమంటి, పతి♦వంచును సత్యరతుండ వంచు లో
నున్నకఠోరగర్భ విపి♦నోర్విని ద్రోసితి వంచనన్ సతిం,
గన్నసుతాళి వీధులను ♦ గాధలఁ జెప్ప వినంగనైఁచి తే
మున్నదొ యింక నాదుగతి ♦ యుల్లమున న్నిను నమ్మియుంచుటన్. ౧౪౦

ఉ. క్రోఁతిగఁ బుట్టియైన నినుఁ ♦ గొల్వకపోయితి; గ్రద్దనౌచు సం
ప్రీతిని బ్రాణ మియ్యఁగను ♦ మేకొననైతిని; భూఃమూషికం

బై తగుసాయముం జలుప♦నైతిని ; బోయత నోచు సాపడన్
జాతిఫలంబు లీయ; నెటు♦సార్థకమానొ మదీయజన్మమున్. ౧౪౧

చం. అడవిని రాయినైన, గహ♦నాంతరమందలి గ్రద్దనైనఁ, గా
ఉడవిని దుష్టకాక మయి ♦ యాజడివెట్ట, నయోధ్య వీథిలో
మిడిచెడుకుక్కనైనఁ, దమి♦మీఱఁగ దండక వృక్షమైన, దం
డడి నిల జన్మ మెత్తనుగ♦దా భవదాస్య విలోకనాప్తిచేన్. ౧౪౨

సీ. దొరకునే నాబోఁటి♦విరసమానసునకుఁ, దావకీనపదాబ్జ♦సేవనంబు
వెలయునే నావంటి♦విషయమేధునకును, దావకభక్తిసు♦ధారసంబు
చలుపునే నాయట్టి♦జాత్యైకమానియుఁ, ద్వజ్జన్మవేళ స♦భ్యర్చనంబుఁ
గలుగునే ననుఁబోలు♦ఘనతమోంధునకును, దావకీనముఖేందు♦దర్శనంబు

తే. ఏది గతి నాకు రక్షకుం♦ డెవ్వఁ డయ్య, నీవనాదృతిచేసిన ♦ నీరజాక్ష!
యన్యమేదియుఁ గోర నో♦నట్లుగాని, చాలు నీపాదభక్తి నో♦సంగితేని. ౧౪౩

మ. అవతారంబులు లేవె యవ్వి ఖలసం♦హారంబునుం జేయవే
యవి నీనామసదా౽వ్యయాభిరుచి నే♦లా పొందవం చాత్మలోఁ
దవులం జింతన సేసిచేసి కలత♦త్త్వంబెల్ల నేఁ గంటి రా
ఘవ! దివ్యామృతలబ్ధజన్మ మొసరం♦గా లేమినిం గాదొకో. ౧౪౪

సీ. క్షోణీసురాత్మజా♦సుప్రదామోదక, యని యన్న భవభయం ♦ బణఁగిపోవు
నీ వబ్బసుఖము ని♦ర్నిద్రతఁజేసెద, వనిన నిత్యశ్రీల ♦ నమరు సుఖము
ధీరామలగుణవి♦హారా యటన్నను, బాపసంఘవిభంగ♦ పటిమ బాఁతె
యమితనయాన్వితా♦శ్రమవర్ధనా యన్న, నిత్యవిభూతిని ♦ నెగడఁగల్గు

తే. శరణు శరణంటి రామ!నీ♦బిరుదములను,మామకాఖ్యార్ణసంఖ్యాక♦ధామసంస్థ
వర్ణములఁ ద్రోసిచదివిన♦నిర్దయ మగు,నఱిమొసర్చిన నన్ను నీ♦యపయశంబు. ౧౪౫

సీ. అవతారములు లేవె ♦ యాబాలగోపాల, మును ముక్తిఁ జేర్పంగఁ♦ గనవు గాక
మంత్రము ల్మహి లేవె ♦ మననీయమహనీయ,తారకఖ్యాతికిఁ ♦ దగవుగాక
సత్యవాదులు లేరె ♦ సాతత్యవైయాత్య,రామవాక్యాభిఖ్య ♦ రాదుగాక
కరుణాపరు ల్లేరె ♦ శర ణన్న సుర లెన్న, వైరిసోదరుఁ బ్రోవ♦లేరుగాక

తే. వ్రతులుధరలేరె యేకభా♦ర్యావ్రతస్థు, లెచటఁ గనరారుగాక ని♦న్నెన్నఁ దరమె
భక్తరక్షణనిస్తంద్ర ♦ పార్థివేంద్ర! రమ్యగుణసాంద్రపట్టాభి ♦ రామచంద్ర! ౧౪౬

సీ. బాజాతిజనములు ♦ నీజాజి గోఁజాడ, బేజాఱుపడినట్టి♦వితముతోడ
తహశీలుదారుల ♦ తహతహపాటులఁ, గలఁత చెందినబుద్ధి♦యలఁతతోడ
గ్రామైకరాత్రంబు♦గా దివసైకభు,క్తంబుగాఁ బహుప్రయా♦సంబుతోడ
క్షయము కారణముఁగ ♦ స్వర్ద్వారపర్యంత,గమనాగమనభవ♦శ్రమముతోడఁ

తే. బలుకఁ గడఁగితి నీమాతృ♦పరిణయంబుఁ
జెనుగుచుమగుల నుడిపి నా♦నుమలఁ గృతిని
గడఁగనంగను జేయుమా ♦ కరుణమీఱ
రక్షితామరలోకేంద్ర ♦ రామచంద్ర! ౧౪౮

సీ. పట్టుగొడుగులు ♦ పవలింటిమబ్బులు, కరదీపికలు తటి♦ద్గణము లిరులఁ
గైవారములు మేటి♦ఘంటాపథంబులు, పటకుటీరంబులు ♦ పాదపములు
పాకశాలలు వృక్ష♦వారమూలంబులు, పచ్చడిమెతుకులే ♦ పాయసములు
తోటితలారులు ♦ త్రోవతోడులు నెడ,తీయనిచర్చ మా♦దిగలరచ్చ
తే. గాఁగ నోరంతప్రొద్దిదో♦కారణముగఁ, బొట్టకొఱకుచుదిరుగునా♦బోఁటు లేడ?
నిన్నుఁ గావ్యముఖంబున♦ నెన్ను టేడఁ, దావకీనకృపాదృష్టి♦దవుల కున్న? ౧౪౯

సీ. సత్త్వభక్తిక్షీర♦సంక్లిన్నమై నిర,తామలశ్రద్ధాసు♦హల్య మగుచు
నమరుకౌసల్యాహృ♦దాలవాలంబున, విష్ణుపదధ్యాన♦బీజ మెసఁగ
నాజిదోహదకారుఁ ♦ డనువేలరక్తి సు,ధాభిషేకంబున ♦ ననువుపఱుప
నంకురమై గాధి♦జావితమై యేచి, మృదులసీతాలతా♦వృతము నగుచు
తే. నలువముక్కంటిపట్టుఁగొ♦మ్మలకుఁ బ్రాఁకి, కమలజాతాండకర్పర♦కాయమాన
మొనసియవ్యయఫలదమై♦యొప్పరామ, కల్పమిటుఁ గాకనామనః♦కాంక్షితములు.

ఉ. ఆసురశిక్ష భూమితన♦యాగ్నిప్రవేశము కాకరక్షణం
బాసవమాధవాభయము ♦ నంబుధిబంధన మాంజనేయసే
వాసుకృతంబు పుష్పకని♦వాసము కార్ముకభంజనంబు మే
ధాసుభగత్వ మోక్షపక♦ఫల్ దిగధీశవిధిస్మరేశు లా
వాసపటాళి వ్రాసి యతి♦భక్తి భజించెడి రాముఁ గొల్చెదన్. ౧౫౦

చం. క్షితిపయిఁ బుత్రభిక్ష శచి♦కిం, బతిభిక్ష సురప్రవంతికా
సతికిని, జీవభిక్ష దివ♦సప్రభుసూతికి, గౌతమర్షి కిన్
హితగతిఁ బత్నిభిక్షఁ, ద్రిది♦వేశుల కస్ఖలితాన్నభిక్ష, నా
యతమతి నిచ్చు వేల్పు పర♦మాత్ముఁడు నా కిడు మోక్షభిక్షమున్. ౧౫౧

తే. రామచంద్ర! సుతుండు మున్♦రాగమునను
బాడ నీజన్మకథనంబు ♦ నాఁడు వినితి
రామచంద్రసుతుం డను♦రాగమునను
బలుకునీమాతృకథ మది ♦ యలర వినుము. ౧౫౨

# కథాప్రారంభము.



కం. శుకుని న్వర్జితకట్యం, శుకునిన్ ముఖకాంతిహసిత♦శోణమరీచ్యం
శుకుని న్వ్యాసమునీశశి, శుకునిం గని యనియెఁ బార్థ♦సూనునిసుతుఁడున్. ౧

చం. అడిగెడువారి కేమి యన♦యంబును జెప్పెడివారు గల్గఁ దా
రుడుగక ప్రశ్న సేయ నగు ♦ నూఁకొను టంతియ కాదె? వేసటన్
బడలక చెప్పఁగా వలదె ♦ వారని ప్రేమ; ధనైకకాంక్షచే
నడిగెడియాచకుండు దెలి♦యంగ సమర్థుఁడె దాతృకష్టమున్? ౨

కం. అట్టుల కావున నిన్నా, ళ్ళట్టిట్టును గదలనీక ♦ యడుగఁగ మీరుం
బట్టుగఁ బ్రేమం జెప్పటఁ, బుట్టెను మఱిమఱియు నడుగ ♦ బుద్ధియు నాకున్. ౩

చం. హరి జనియించి తా దశర♦థావనినాథతనూజుఁడై తనుం
బొరిగొను నంచు రావణుఁడు ♦ పూర్వమె విన్కియుఁగల్గి కంసువై
ఖరి మహితాంతరాయములఁ ♦ గల్పన సేయక యున్నె? చెప్పుమా
ధరణిపుజన్మకర్మచరి♦తల్ హరి యాతనియందుఁ బుట్టుటల్. ౪

కం. నాచెవులు హరికథ ల్వీన, వాఁచినయవి యానతీవె ♦ వాచవు లొలుకన్
వాచంయమివర్యా! నీ, వాచరితము రవికులోద్భ♦వాచరితంబున్. ౫

ఆ. అనుచుఁ దన్ను వేఁడు♦నభిమన్యుసుతుఁ జూచి, చిలుకజోగి కరుణ♦చిలుకఁ బలికె
నీదుప్రశ్న చూడ♦నిఖిలోత్తరం బయ్యె, రాకుమార! యుత్త♦రాకుమార! ౬

కం. చిత్రము దశరథుసచ్చా, రిత్రము వినుమా యరీణ♦రీతి న్వినుతున్
గాత్రము గగ్గురుపాటువఁ బ, విత్రము భవపంకహృతిప♦విత్రం బగుటన్. ౭

కం. సాధువిరోధులు జనధన, మేధాబలముల నదెంత ♦ మీఱుచు నున్నన్
సాధింపలేరు సుజనుల, సాధువుల న్మాధవుండు ♦ సంరక్షించున్. ౮

ఉ. అందని మ్రానిపండు కడు♦హ్రాస్వనరున్, భృశనీచలోభి కిం
పొందుయశంబు, మందునకు ♦ నుత్తమసాహితి, పాపజాతికిన్
డెందమునందు బల్లియ, క♦డిందిపనుల్ నిఱుపేద, కెట్లటం
చుందురు వైర్యసాధ్యను న♦యోధ్యను లోకులు శత్రుకోటికిన్. ౯

తే. నేల గలయంతపట్టును ♦ నేలఁ గలిగి
కోచలై నృపు లరిగట్టఁ ♦ గోసలపురి

భూజనములకు నైలింప♦భూజ మనఁగ
రమణ విహరించు రఘుధరా♦రమణుఁ డధిప. ౧౦

వ. నిరఘుండై నయారఘు వొక్కనాఁడు సర్వతంత్రస్వతంత్రు లగుమంత్రులును, బరమదసుక్షీరాతువులగురాతులును నుచితానుచితవివేకులగుప్రాడ్వివాకులును, నాగామికశుభాశుభవిజ్ఞు లగుదైవజ్ఞులును, సకలకళాధారు లగుధీరులును, నిజప్రతాపహాసితసూరు లగుశూరులును, వినయరసామంతు లగుసామంతులును గొల్వఁ బేరోలగంబున నున్నయెడ దౌవారికుం డరుదెంచి ౧౧

కం. ఊరు విదర్భాపురమఁట, వారు పురోహితులఁట జన♦వరుఁ డనుపంగం
గూరిమిని వచ్చినారఁట, వారికి మీదర్శనంబు♦ వలెనఁట దేవా. ౧౨

కం. దేవర! వచ్చితిఁ దెలుప ని,దే వరమతి యొప్ప నిలిపి ♦ దేహళికడ నే
దా వారికి సెల వెయ్యది, దౌవారికునకును ముదల ♦ దయసేయుఁ డనన్. ౧౩

వ. తరణికులాభరణం బాదరణంబున వారల రాని మ్మనుటయు వారలు చనుదెంచి యాశీర్వచనపూర్వకంబుగ. ౧౪

స్వాగతము. తారసిల్లి యరు♦దారనభంబుల్, గారవించువడి ♦ గ్రావముల న్నీ
చారుకీర్తి; సుఖ♦సంపదయే? యం, చారయంగ నృపు♦స్వాగత మిట్టుల్. ౧౫

వ. రఘుమహారాజును వారల నుచితసత్కారవిధుల మన్నించి యర్హాసనాసీనులం జేయఁ బనిచి తదాగమననిదానం బడుగుటయు వారలు ౧౬

కం. భోజుఁడు యాచకనిర్జర,భూజుఁడు మాదాంధవైరి♦పుష్కరజాతాం
భోజుఁడు జననుతసద్గుణ,భోజుఁడు మీసేమ మడుగఁ ♦ బంపె న్మమ్ముల్. ౧౭

వ. అతండు తనయనుజాత యగునిందుమతి స్వయంవరమహోత్సవంబునకు ౧౮

కం. శ్రీమంతులు సౌందర్యర,మావంతులు విక్రమమహి♦మావంతులు స
న్మావంతులు కులగుణసుష,మావంతులు రంహ శౌర్య♦మావంతుల రేఁ. ౧౯.

వ. అని యందఱుఁనృపాలురకుం దెలియఁ బఱచి మమ్ము మీకడ కీకమ్మనిచ్చి పుచ్చిన వచ్చితి మనుటయుఁ దమకమ్ముగ్రమ్మ నక్కమ్మఁ గరమ్మునఁ గరమ్మునికరమ్ముగు కనికరమ్మునఁ గొని కని తదాహ్వానమ్మునకు మనమ్మున సమ్మతించి వారలఁ బోవంబంచి తనయంచున రమాకుమారు మాకుమారుఁ గుమారు మాఱుపఱుచు వేషమనీషాబలవిశేషంబుల మీఱుచు ౨౦

కం. తన యాకారము దోఁపఁగఁ, దనయాకారంబుతోడుఁ♦త నయాకృతి శ్రీ
తనయాకృతివిలసిల్లెడు, ఘను నజునిం జూచి పలికె ♦ గారవ మారన్. ౨౧

ఉ. వీరలవాక్యముల్ వినితె ♦ వీరుల కియ్యది యాత్మపౌరుషో
దారవిహారభంగి నరు♦దారఁ బొగడ్తకు నెక్కువేళ; దో

స్సారము పేర్మి నీవు నవ•సారసలోచనఁ గొంచు రమ్ము పు
త్రా! రహిమీఱు నీబల ము•దాత్తయశంబు జగం బెఱుంగఁగన్. ౨౨

ఉ. సారముదంబు పేర్మి నవ•శారమనోజ్ఞ గ్రహింప విప్రతీ
సారము మీఱఁ దారు భుజ•సారమున న్నృపవర్యకోట్లహం
కారము తోడు మన్మథవి•కారముఁ గూడఁగ దుష్ట మాక్రియా
కారము లుగ్గడించి ప్రతి•కారము సేయఁగఁ జూతు రాత్మజా. ౨౩

ఉ. ఘోరచమూసమూహములు • ఘోటు లవారణవారణంబు లే
పార నపారమైన భట•వర్గ మనర్గళరీతిఁ గ్రాలఁగాఁ
జేరి విదర్భరాజపురిఁ • జెన్నుగఁ గన్నియఁ గొంచు నిర్భర
శ్రీ రహిమీఱ రమ్ము జయ•శీలుఁడవై తనయా! రయమ్మునన్. ౨౪

కం. విను తనయా! వినుతనయా, వనిత నయము మీఱఁ దెమ్ము • భద్రం బనుచున్
సనయముగా దీవించుచుఁ, బనివిను మని పనిచెఁ దోడు•పడ సైన్యంబుల్. ౨౫

వ. ఇట్లు పంచిన నజుండును ౨౬

## అజమహారాజిందుమతీస్వయంవరమునకుం బోవుట.

కం. ఇందుమతి లేని సౌఖ్యము,పొం దొకపొందే తలంపఁ • బూరుషమణికిన్
ఇందు మతి లేని సౌఖ్యము,పొందొకపొందే తలంపఁ • బూరుషమణికిన్. ౨౭

వ. అని సముత్సాహంబున. ౨౮

మ. చని కాంచెన్ వసుధేశనందనుఁడు భా•స్వచ్చారువీచీశిఖా
యనశీతాంచితవాతడోలితసుడో•లాబ్జాబ్జడోలాంతడో
లనలీలాప్రవిఘూర్ణమానవరటా•లాస్యన్మిళిందాంగనా
కనదక్షీణజనేక్షణాక్షణదదీ•ర్ఘాశర్మదన్ నర్మదన్. ౨౯

ఉ. నర్మదఁ గాంచితే యనుఁగు•నర్మద! నిర్మదలోక పాళికిన్
శర్మద, దృష్టిమాత్రకువి•చారజనాఘవిదారణక్రియా
ధర్మద, స్నానలోలజన•తాశమనేష్వపహాసిప్రహాదినీ
వర్మద, శీతవాతతట•వర్తిసునర్తనజాతఘర్మదన్. ౩౦

వ. అని చెలికానికిం జూపుచు డాయం బోయి ౩౧

కం. నీవారము గ్రసియించుచు, నీవారిని గొనినవాని • నిర్జరయువతుల్
నీవార మనుచు నుందురు, నీవారము గావు మమ్ము • నిండారుదయన్. ౩౨

శా. ఆమందాకినిసంగమంబు మదిలో•నాసించునే? యెంచునే
శ్యామాంగ న్యమునాస్రవంతిని? సర•స్వత్యాపగం దేపకు

న్గామంబొప్ప రహఃప్రవర్తనల నానందించునే యబ్ధియున్?
నీమందానిల మింత సోఁకుతఱి మేనిం బూర్వభాగీరథీ! ౩౩

కం. తనమనుమరాలి వగు నిన్
దనమనము విరాళిఁ దూలఁ ॥ దహతహఁ గను నీ
తనుమహిమయొ యటుగాక య
తనుమహిమయొ రేవ! నిజము ॥ దలఁప జలధియున్. ౩౪

## అజునిసేనపై వనగజంబు గవియుట

వ. అని యజ్జవాలుపడగదొరయొజ్జ బొజ్జ బుజ్జగించు నజ్జలధిపతికజ్జలవతి వినుతించు మ ముజ్జగంబులకర్రజ్జువులు పజ్జనజ్జగ నుజ్జగింపంజాలు నజ్జలంబుల సజ్జకంవు సజ్జన నజ్జనపతి పరిషజ్జనంబులతో మజ్జనాదికంబు లొనర్చి యాయజ్జున నాపజ్జ నొకసజ్జ హజ్జలంబులసెజ్జ నున్న నట్టియెడ నట్టియగుట్టు మట్టుపడ నెట్టన మిన్నుముట్టినదిట్ట రూపంబునఁ గుట్టారంబులు పదఘట్టనంబుల నటిట్టు బిట్టుకొట్టుకొనియాడ దట్టించిన రట్టునఁ జెట్టులెల్ల నొక్కపెట్ట మొదలుముట్టఁ బట్టుచెడి నేలమట్టంబుగ వ్రాలఁ, గావలంబునకుఁ దావలం బైనయొక మదావిలమదావళంబు హేరాళంబుగ రొదాళం బంతరాళంబు వగుల సరాళంబుగఁ గవిసి పాళెంబు వేళాకోళంబుగా విచ్చలవిడిఁ బెచ్చు పెరిఁగి పొచ్చెంబులేక హెచ్చిన వచ్చపుమచ్చరంబున సేనఁజొచ్చి క్రచ్చఱ వచ్చి కచ్చునఁ బైవచ్చిన పెచ్చారులు పిచ్చలింపఁ గ్రుచ్చియు గాటంబుగ వాటం బుగ నాటిన గూటంబులఁ గట్టుటఁ గొట్టాముఘోటంబులకూటంబులఁ గూటంబుల తోడఁ గరహాటంబులఁబోలె నిరాఘాటంబుగఁ బీఁకి సపాటంబుగఁ బాటవంబు సేసియు నఖండ కాండోద్దండవేదండప్రకాండదండంబులతుండంబుల శుండాసండం బునఁ బ్రచండంబుగఁ బట్టి చండరవపిచండిలదిగ్జండలంబు ఖండఖండంబులుగ నేలఁ జమరుచుఁ జూపఱు సంచలింప సంచరింపఁ బంచబంగాళమైనపంచమంగళంబులును బచ్చముపాడైన నిగిడారుగుడారులును గలిగి వాఁడిదఱిఁగి వాడఁబాఱినసేనం జూచి

కం. తామరకొలనిదెఱంగునఁ, బామరజనములను గజము ॥ పటుగతిఁ గలఁచెన్
ఏమఱఁ దగునే సేనల, కీమఱుకువఁ బాపవలదె ॥ హితమతి నగుచున్. ౩౫

కం. ఏనిక మదసహితం బగు, నేని కడిమిఁ గలనఁదక్క ॥ నితరతలములన్
జేనికినిఁ జంపరా దన, నే నిక సైన్యమును దంతి ॥ యేపడఁగించున్. ౩౬

వ. అని ౩౭

కం. వాలెము నాతఁడు వైచిన, వాలెముకలఁ దూఱి నేల ॥ వ్రాలుచు జముప్రోల్
పాళెముఁగొనెఁ గరి; నరపతి, పాళెము సంతోషమునను ॥ బరివర్తింపన్. ౩౮

వ. ఇట్లు జడిపింప బెడిదంబుగ నడిదంబున నడిచిన గజంబు పుడమిం బడుటయు నక్క
డిండిమగండు డెందంబునం గుందుచు ౪౦

కం. వెఱగొన నడిదమువైచిన, మొఱయిడుచుం జచ్చె గజము ♦ మునుకంబఱఁగాఁ
బిఱుసుచెడి పిడుగుతాఁకున, నొఱగిలఁబడినట్టి గట్టుఁ♦గో యని తోఁపన్. ౪౧

ఉ. కారణమేది వారణని♦కారణకారణమైనయీయసం
స్కారభవాఘమిట్టులు ని♦కారవిధంబున వచ్చెఁ గా; ప్రతీ
కారము సేయు టెట్లు? నుడి♦కారముచే నఘమాఱునే? నిజా
గారముఁ జొచ్చుటెట్లు? ననుఁ ♦ గన్నఘనుం గను టెట్లు పాపినై? ౪౨

మ. అనుచుం గూఱినవంత వందురుచు నుం♦న్నంతం గనున్ వింతయై
వనకుంభీంద్రతనూవినిర్గతమహా♦భాస్వత్ప్రభాజాలముల్
ఘనమై దిక్కులఁ బిక్కటిల్లె, జనసం♦ఘుం బొప్ప నిశ్చేష్టమై
కనరాఁగ న్నడుమంత్రమందు నొకయా♦కారంబు తోరంబుగన్. ౪౩

కం. భగ్గున వెలుంగువోఁచిన, ధి గ్గని చూపఱకు మనము ♦ దిటచెడఁ గాంతిన్
దిగ్గన బ్రమఁగన్ను వడ, న్నిగ్గునఁ దరతరము చూడ ♦ నిపుణత నందున్. ౪౪

సీ. నగుమోముగలవాఁడు ♦ నగధామహిమధామ,వరధామమైయొప్పు♦నపువువాఁడు
తళుకుఁజూపులవాఁడు ♦ తతహీరమణిహార,పదహారికంధరా♦పదమువాఁడు
సొగియురూపమువాఁడు ♦ సురరాజరవిరాజ,దీప్తిరాజితమైన♦తేజువాఁడు
హైమచాపమువాఁడు♦హాటిహేతిరుచిభూతిఁ, బరిభూతియొనరించు♦వాలువాఁడు

తే. ఇంబుమీఱినమణికిరీ♦టంబువాఁడు
కంబుజిగిబిగినవ్వుకం♦ఠంబువాఁడు
డంబువెలసినవిపులవ♦క్షంబువాఁడు
చూడఁజూడంగఁ దోఁచె నా♦చూపఱులకు. ౪౫

వ. ఇట్లొక దివ్యపురుషుండు దోఁచి యజునిం జూచి. ౪౬

కం. ఏను బ్రియంవదుఁ డనియెడి,గానకళానిపుణుఁడైన ♦ గంధర్వుండం
గాన కెద మీఁదుమిక్కిలి, మానీంద్రు మతంగుఁ జెనక ♦ మాననికనుకన్. ౪౭

కం. ఆయన చుఱుచుఱు నను నొ,రా యనుచును జూచి మదిని ♦ రాఁజఁగఁ గోపం
బోయన మత్తుఁడవై యిటు, సేయుట సేనంగురూపుఁ ♦ జేకొను మనియెన్. ౪౮

ఉ. తిట్టిన బిట్టుకోపమునఁ ♦ దెల్వి నశించి స్మయాంధకారముం
దొట్టినయట్టికన్నులకుఁ ♦ దోఁచపుబీతువెలుంగుఁ జూపి నా
కట్టెడిసేఁత నిట్టు లొడి♦గట్టితిఁ జెట్ట నటంచు నన్ను లోఁ
బట్టుగఁ దిట్టుకొంచు ముని♦వర్యునిపాదయుగంబు వట్టుచున్. ౪౯

కం. కొడుకులు దొడిఁబడిచేసిన,దుడుకులకుం దండ్రు లిట్లు • దుటుకునఁ జంపం
గడఁగుట కటకట కాదే, కడగంటను నెనరు చిలుకఁ • గనుమా! తండ్రీ. ౫౦

తే. ఆచరించితి నీకు మ • హాపరాధ
మైన దయఁజూడుమా నన్ను • మౌనివర్య!
తండ్రి తనవక్షమును గాలఁ • దన్ను శిశువు
ముద్దులాడునొ నేలపై • మోఁది చనునొ? ౫౧

కం. దరమున వేఁడఁగ నిటు లా,దరమునఁ గని యనియెఁ గొన్ని • తెరముల మీఁదం
దరము ననరానియజుఁ డీ,దరిఁ దఱియ న్వచ్చు నట్టి • తఱి నీవు వెసన్. ౫౨

కం. అరవాయి గొనక నీ వా,తరవాయిని దాఁచుమా! బెదర • వాయిని నిన్
దరవారిఁ ద్రుంచు నాతఁడు, సరివాయును నంత ఘోర • శాపం బనుటన్. ౫౩

వ. నిన్నయోధ్యాధీశ్వరుం డగురఘువుతనూజు నజుంగా నెఱుంగుము. నాదు చిన్న విన్నపం బొండు కలదు వినుతు వినుము. ౫౪

కం. ఉపకారికి నుపకార మ,చపలమతిం జేయవలయు • శక్తుఁడు గాఁడే
నుపకృతినిఁ దగదు మఱవఁగ, శ్వపచుఁడుగద మేలుమఱచు • జడమతి యధిపా. ౫౫

ఉ. రక్తిమెయి న్వచించెద ధ • రాధవనందన! విన్ము నాయథా
శక్తి, భవత్కృతంబునకు • సాటిగ నే నొనరింప నేర, నా
సక్తిని నస్త్రరాజ మిది • సంగరరంగమునన్ జయంబు సు
వ్యక్తముగా నొసంగునది • యాదృతి నిచ్చెద వే గ్రహింపుమీ. ౫౬

కం. సమ్మోహన మనఁబడు నిది, సమ్మోహనసంబుసేయు • సూడులతుటుముల్
గ్రమ్మిన నాహవమునఁ; గ్రై,కొమ్మా కొమ్మను గొనంగఁ • గొమ రగు నీకున్. ౫౭

వ. అని సమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగోపసంహారక్రమంబులతోడ సకీలకసమంత్రకంబుగ నొసంగి చనుటయు ౫౮

కం. అటు విక్రమంబు వెలుఁగం, బటుతరసంరంభ మొనర • మార్తాండకులుం
డట వడిఁ జనిచని కనె నా,దటఁ గ్రథకైశికపురంబు • దర్పోజ్జ్వలుఁడై. ౫౯

కం. దుర్భరశాత్రవభీప్రద, నిర్భరలక్ష్మీనివాస • నిస్తులితమణీ
గర్భామణికుండలసం,దర్భరుచిం జెలఁగు నావి • దర్భం జొచ్చెన్. ౬౦

వ. అప్పు డప్పురంబున. ౬౧

## ఇందుమతీస్వయంవరమహోత్సవము.

సీ. ఘోటకవరనిరా • ఘాటకర్కశఖుర,స్ఫోటితపాంసులా • స్తోకరజము
సాంద్రసామజసువి • స్తారసాగరమదా,సారసారస్యవి • శాలపథము

తే. వరపదాతిపదాహతి ♦ వడివడంక, ధరణిభరణకరణహిత♦పరులు పరులు
వోలెఁ దహతహలాడిరి ♦ పుడమిఁగలదె, ధారణీనాయకునిజైత్ర♦ధాటి సాటి. ౧౨౭

సీ. నవకంపుబుక్కాము♦సవురుదాల్చెనుమింట,నృపుధాటిఁబరికించు♦నెలఁతలకును
బెట్టనినునుబూది ♦ పట్టైలె కనుపట్టె, వైరికాంతాముఖ♦వ్రాతములను
జెంగావిరంగారు ♦ రింగులెసెలంగిన, కంగోరు లయ్యె ది♦శాంగనలకుఁ
దారామునదనేదిఁ ♦ దా రాడకున్నను, గోరాచుటయ్యె ది♦క్కుంభులకును

తే. దిగ్జయారంభవేళ ధా♦త్రీతలేంద్ర, సమ్యగర్పితధూపపుం♦జంబు లయ్యె
విష్ణుపదమున కవనీశ♦విపులసైన్య,ఘట్టనోత్థితభూపరా♦గంబు లపుడు. ౧౨౮

వ. ఇట్లు చనిచని నీవాఁడ నన్న తేఁడులపోఁడిమి మాపక సూడున నెదిరిన వేఁడిమిచూపి
తెఱల్చుచుఁ జనుచు. ౧౨౯

ఉ. కోరఁడు కొల్లలం గొనఁగఁ ♦ గోరఁడు పూర్గృహదాహ మేమెడం
గోరఁడు రిత్తహింస లిడఁ ♦ గోమలులం జెఱవెట్టఁ డెయ్యెడ
న్గోరె జగత్త్రయీజనమ♦నోవితతాద్భుతహేతుభీకరో
దారభుజాబలం బరివి♦తానముమీఁదనె చూప నాజిలోన్. ౧౩౦

చం. ధరణిపుఁ జూచిచూచి విబు♦ధప్రమదల్ మదనాశుగాహతిం
బొరిఁబొరి సొక్కుచుందురు వి♦భుండు దిశాజయధాటి వోవ సం
గరమున వానిఁ దాఁకునృప♦కాండముల న్వరియింపఁ జొచ్చి రా,
స్మరశరవశ్యచిత్త లగు♦మానికదారుల కేటికూరుముల్? ౧౩౧

కం. కుంతలవల్లభసురుచిర,కుంతలదీధితులు వెలసెఁ ♦ గోసలధరణీ
కాంతపదాంబుజసక్త,స్వాంతనటన్మధుకరాళు ♦ లై య య్యెడలన్. ౧౩౨

కం. స్వబలము పలాయనంబై,న బటాబూరంబుచెడి వ♦నంబులఁ బడుటన్
శబరాధీశున కప్పుడు, శబరాధీశత్వ మవని ♦ శాశ్వత మయ్యెన్. ౧౩౩

ఆ. నే వరాటకాఖ్య♦ నెగడుదుఁ బ్రజ మాన,మునను నను గణించు♦మొదల నీదు
కరుణ కలిగెనేని♦గాంగేయ సమముగాఁ,దూఁగఁగలుననన్నుఁ♦ద్రోయవలదు. ౧౩౪

వ. అనిన నతని నాదరించె నంత నొక్కపెట్ట రాపట్టు లందఱుపై దాడివెట్టుట నీతిగామి
శక్తుఁ డయ్యును బ్రాజ్ఞుం డగునద్ధరారమణుం డొక్కొకతేప నొక్కొక్క దిశ భూపతు
లన్ జయింపఁ బోవుచుఁ బ్రాధ్వంకృతసమస్తరాజన్యుఁడై విహరించుచుండ నొక
నాఁడు సుమంత్రుండు. ౧౩౫

కం. ఇది దక్షిణకోసల బల,మదమున భూభుజుఁడు భాను♦మంతుం డేలున్
ముదమున నత్రివచించిన, మదిరాక్షికి జనకుఁ డితఁడు ♦ మహీపా! యనుచున్.

చం. అనినను లెస్సగాక బల ♦ మంతట నంతట నిల్పఁ బంపు చే
కొనకుము యుద్ధకృత్యములు ♦ గొబ్బునఁ బాళెము సేద దీర్పఁ గోఁ
బనుపుము మంత్రులం బిలిచి ♦ భావనసేయుద మెల్లకార్యముల్
మనమున నంచుఁ బల్కిన సు♦మంత్రుఁడు పిల్వఁగఁ బంచె మంత్రులన్. ౧౩౭

వ. వార లరుగుదెంచి సర్వంబు విని వసిష్ఠాదు లైన పెద్దలతోడ నాలోచించి సందేశంబు పుచ్చుట లెస్స యన నట్లకాక యని వారలం బోవఁ బనిచి నిజపటకుటీరాభ్యంతరమునకుం జని వసిష్ఠు ధ్యానించిన నతండు విచ్చేయుటయు నమస్కరించి నిజమనోగతం బెఱుంగఁ జెప్పి యిట్లనియె. ౧౩౮

ఉ. ఆలలనాభిరూప్యవిభ♦వామలశీలకథానువర్ణముం
జాలఁగ వించుచున్ శ్రవణ♦శష్కులిపాత్ర నిరంతచింతనా
తూలిక నంతరాళమునఁ ♦ దొయ్యలి మానసచిత్రకారుఁ డా
ర్యా! లిఖియింపఁ గన్నులు య♦థార్థ మెఱుంగఁ గఁ గోరెడుం గదన్. ౧౩౯

వ. అని వచియించుటయు నతండు భావి భావించి యట్లు కావించెద నీవీసాయంతన సమయంబున నిచ్చోటి కనతిదూరంబునఁ జక్కటిపొదుపుమూలచాయ నరుగుమం దొక్కప్రమదవనంబు గల దందు నీనయనపర్వం బగు నని పల్కి యదృశ్యుండయ్యె నంత దశరథుండును గల్పప్రాయంబులుగఁ దోఁచుక్షణంబుల నెట్టెట్టో కడపుచు నేఁడేల సూర్యుండు మందగమనుం డయ్యెనని యెంచుచు సాయంసమయంబగుడు ముని నిర్దిష్టమార్గంబునం జని ప్రమదావనంబుఁ జొచ్చెను. ౧౪౦

చం. తరుణకుసుంభవర్ణపరి♦ధానవిబద్ధకటిప్రదేశయై
తరుణి నిజాంశుకాంచలము ♦ తా నిటులట్టులుఁ దూఁగియాడ సిం
ధురగమనంబు దోఁపఁ జను♦దోయి మిథోధికకర్షణంబునన్
సరములరాల్ప మౌక్తికర♦జం బరుదెంచుచునుండఁ గన్గొనెన్. ౧౪౧

వ. ఇట్లు చూచి మెచ్చి తలయూఁచి తత్క్రీడావినోదావలోకనకౌతూహలియై యుపదాంతరనికుంజపుంజంబులమాటున దాఁగి యుండె నని శుకయోగి పరీక్షిన్నృపాగ్రణి కెఱిఁగించిన తెఱంగు. ౧౪౨

ఉ. వా(స)వరత్న మేచకసు♦వర్ణ! సువర్ణపటా! పరాత్పరా!
వాసవపుత్రసింహశర♦భా! శరభాసితహస్తపుష్కరా!
వాసరరత్నవంశ్య! ప్రతి♦భాప్రతిభాసిత! భద్రభూధరా
వాస! రఘూత్తమా! ప్లవగ♦వల్లభవల్లభ! జానకీశ్వరా! ౧౪౩

—*పం చ చా మ ర ము.*—

ర(మా)మనోహరా! నగాధి♦రాజనందనార్చితా!
రుమామనోహరాత్మమిత్ర! ♦ రుంద్రకీర్తిశోభితా!
సుమాంబకోపమానరూప! ♦ సూర్యవంశదీపకా!
సమస్తదేవశస్త! భద్ర♦శైలరాజమందిరా! .. ౧౪౪

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వ
మహావైభవ వావిలికొలను రామచంద్రరాయతనూభవ
సుజనవిధేయ సుబ్బరాయనామధేయ ప్రణీతంబైన
శ్రీ కౌసల్యాపరిణయంబున
ద్వితీయాశ్వాసము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీరామచంద్రాయనమః.

# శ్రీ కౌ స ల్యా ప రి ణ య ము.

## తృ తీ యా శ్వా స ము.



ధారుణిసవనత్రాణప
రాయణ! దీనార్తిహరణ ♦ రాజాభరణా!
ధీయుతనుతచరణా! నా
రాయణ! నతశరణ! వినుత♦రాజాభరణా! ౧

తే. అవధరింపుము దేవ! మ♦హానుభావ, భావనాతీతవైభవ♦పరమయోగ
భావపుంభావకరుణాస్వ♦భావుఁడైన, బాదరాయణి యిట్లను ♦ సాదరముగ. ౨

మ. అతనుద్వేషితమిస్రసార్థకనిజా♦ఖ్యాతుండు భాషాధవా
న్నతవక్షోరుహచందనాయితదిశా♦నారీద్యుముక్తావళీ
కృతగంగాధవశేఖరాయితసురీ♦గేయప్రథాశాలి యో
క్షితిపా! దక్షిణకోసలాధిపతి మిం♦చెన్ భానుమంతుం డనన్. ౩

తే. అతనిదేవేరి జితకుసు♦మాస్త్రనారి, దీనజనకల్పవల్లి సా♦ధ్వీమతల్లి
యధర జితబింబ లసిత♦ఫాలాపహసిత, చంద్రభాగ యనం దగు♦చంద్రభాగ. ౪

—* చంద్రభాగ భానుమంతునితోఁ దనసంతానవాంఛం దెలుపుట. *—

ఉ. ఆవరవర్ణినీసహితుఁ♦డై హితరీతిని బెద్దకాల మా
భావభవాభరూపుఁ డను♦భావ్యమనోభవకేళికావినో
దావహమానసుండయి ని♦రంతర సంసరణైకభోగ్యసా
ఖ్యావహపుత్రలాభజని♦తామలమోదముఁ దా నెఱుంగమిన్. ౫

ఉ. దానముచేసి, చేసి యవ♦ధానమునన్ ధరఁ బాలనన్, హరి
ధ్యానము చేసిచేసి, సువి♦ధానము దప్పక యజ్ఞకోటులం
దా నమరాళిఁ గొల్చి, పరి♦ధానము లర్థుల కిచ్చి యిచ్చి, సం
తానముఁ గాన కెన్నిసువి♦ధానముల న్మదిఁ జింతసేయుచున్. ౬

ఆ. బారసాలఁజేసికొనుచుఁ ♦ బైపడి మెడఁ గ్రుచ్చి, మీఁదికెగయఁ బ్రాఁకి ♦ మేలిపలుకు
లొనరఁ బైఁటఁ జార్చి ♦ చనువేఁడు సుతులేని, సుదతి బ్రతుకు బ్రతుకె ♦ సుందరాంగ! ౧౫

చం. నిరుపమరాగయుక్తుఁ బతి ♦ నిన్, గుణవంతుల నాత్మజాతులం
దరుణులు గోరుచుందురు ♦ ధన్యనిఁ బొంది నిను న్మదీప్సితం
బరయ నొకండు సాగె, మఱి ♦ యవ్యయసౌఖ్యనిదానసూనులా
భరమ లభింపమిన్ మనుట ♦ వ్యర్థము దోఁచెను నాకుఁ జూడఁగన్. ౧౫

చం. అనుచును విన్నఁబాటు వద ♦ నాబ్జము ముంపఁగఁ జంద్రభాగ ప
ల్కిన విని చేరరాఁ దిగిచి ♦ కేలను దన్వి! భవద్విచారమో
యనుపమభవ్యమాఁ జుమి, త ♦ దర్థ మపేక్షిత మాట దానికై
పనిగొని సత్ప్రయత్నముల ♦ వారక చేసితి నెన్నియేనియున్. ౧౬

ఉ. చేసితిఁ బెక్కుజన్మములఁ ♦ జేసితి నెన్నియొ సద్వ్రతంబులం
జేసితి భూరిదానములఁ ♦ జేర్చితిఁ జిత్తమునందు వెన్ను నిన్
గాసియ కాని వే ఱొకటి ♦ గానఁ జుమీ ఫలితంబు సర్వమున్
వీసరవోయె నాయెడను ♦ వెన్ను నకు న్దయలేమి నంగనా! ౧౭

కం. కాన నతకల్పకం బగుఁ, గాన రమారమణుఁ గూర్చి ♦ కాన నియతిమైఁ
బూనెదఁ దపంబు; శీతరు, గానన! యిట నీవు సలుపు ♦ మా హరిపూజల్. ౧౮

చం. అని హృదయేశుఁ డాడినప్రి ♦ యాప్రియవాక్యము లాలకించి యా
వనజదళాక్షి పల్కె ననుఁ ♦ బాసి చనం దగ వౌనె కాన? కో
యనఘ! స్వధర్మకామముల ♦ "నాతిచరామి"యటంచుఁ బల్క వే?
గొన మధికంబు గాదె కవ ♦ గూడి తపం బొనరింప దంపతుల్? ౧౯

చం. ప్రియ యిటు లాడ మే లనుచుఁ ♦ బిల్చి యమాత్యులనెల్ల సర్వముం
బ్రియమునఁ జెప్పి రాజ్యము స ♦ మేధితరక్తిని నప్పగించి భా
ర్యయుఁ దనవెంట రాఁ జని య ♦ రణ్యముఁ జేరి శుచిస్థలంబునం
దయగతిచే జితేంద్రియత ♦ నాలు మగండుఁ దదేకభక్తిమై. ౨౦

—* భానుమంతుని తపస్సునకు మెచ్చి విష్ణువు వరంబులిచ్చుట. *—

చం. చలిపిన ఘోర మాతపము ♦ సంతసమంది రమామనోహరుం
డలరుచు భార్గవీసహితుఁ ♦ డై భవదీప్సిత మెద్ది వేఁడుఁడీ
ఫలితము సేయువార మన ♦ భక్తి నమస్కృతు లాచరించుచుం
గలితనిటాలహస్తపుట ♦ కంజముల న్నృపచంద్రుఁ డిట్లనున్. ౨౧

కం. దేవా! ప్రత్యక్షంబై, కావలసిన దెద్ది యనఁగఁ ♦ గామ్యము వేఁడన్
మావంటి వెడఁగు లీయిల, పై వెదకినఁ గలరె మైనఁ ♦ బంకజనాభా! ౨౨

శా. సంతానార్థముగాఁగ నిన్నుఁజిచ్చి విశ్వస్తుత్యా! యీనిష్ఫలం
గాంతాయుక్తుఁడనై ఘటించితిని నిష్కాముండ నా కెట్లు? శ్రీ
కాంతా! నిన్నని తుచ్ఛకామ్యముల వేఁడ్కం గోరఁగా నొల్ల నా
కాంతారత్నమునం దనూభవుఁడవై కారుణ్యముం జూపవే. ౨౩

కం. అటులైన నిహపరంబులఁ, బటుతరముగఁ బొందఁగలను బద్మాక్ష! భవ
త్స్ఫుటకారుణ్యము పేర్మిని, ఘటియింపుము నాదుకోర్కిఁ గాదనక వెసన్. ౨౪

చం. అన విని పిన్ననవ్వు దొలఁకాడఁగ భూభుజుఁ జూచి పల్కె నా
యన! భవదీయపుత్రకుఁడనై జనియింపఁగ రాదు నాకు, నీ
తనయకు నాత్మజుండ నయి తథ్యము నీకు శుభంబుఁ గూర్తు, నం
దను ననుఁ గోరినాఁడవు గదా జనియించును నీకుఁ బుత్రుఁడున్. ౨౫

వ. అని యంతర్ధానం బగుటయుఁ దదీయకరుణావిశేషంబున కచ్చెరు వందుచు వారు పురంబునకుం జని రంత వరప్రభావంబునఁ జంద్రభాగకు నెలమసలుటయు. ౨౬

కం. బలిసెను నడు మలసెను నడ, వెలసెను నూఁగారు మోము వేవి ల్లోకస్తై
గలసెను వళు లొలసెను నిదు, రలు మనుపయి నాస సతికి రహియించెనటన్. 

కం. కోకనదచారువదనము, ప్రాకటనవనవపరాగరాజిత మగు శ్రీ
కోకనదం బన ధవళ, శ్రీకలితం బయ్యె గర్భచిహ్నము దోఁపన్. ౨౭

## —* కౌసల్యాదేవి జననము. *—

వ. ఇట్లు నెల లంతకంతకు నెక్కుటయు రాజానన వై జననంబున నొక్కతనయనొక్కతేఁ దనయఁ గాంచినఁ దద్వృత్తాంతంబున కలరి నృపుం డుత్సవంబు సేయించి యమితోత్సాహంబునఁ బొదలుచుఁ బుత్రునకు భామమంతుం డనియుఁ గూఁతునకుఁ గౌసల్య యనియు నామకరణంబులు గావించి సంతోషాంబునిధి నోలలాడుచుండె నంత నక్కౌసల్యయు దినదినప్రవర్ధమానయై. ౨౮

మ. తనతో నాడెడితోడిబాల యొకచేతం బుండరీకంబు నో
య్యనఁ దాల్పంగఁ బసిండిబొమ్మ యల కన్యారత్న మవ్వేళ దా
సిని బంగారపుఁదమ్మిఁ దె మ్మనఁగ సుశ్వేతాంబుజం బొండుఁ గై
కొని చేనియ్యఁ దటాలున న్మదినిం బొంగుం బూరి తేచ్ఛంబలేన్. ౩౦

వ. ఇ ట్లబ్బాలామణి కన్యాత్వంబు గడచిన. ౩౧

మ. నవలావణ్యరసాభిషేచనవిధి న్వక్త్రాబ్జ మింపొంద సొం
పవువక్షోరుహమంజరుల్ మలఁపుమాపన్ వాతెఱన్బింబమును
దవులంగాఁ దనర క్తిమంబు నయనాబ్జత్త్రేపక్షోజిఱిఁగాటంరద పెంపొందఁగాఁ

రవిహారం బొలయన్ మనోజ్ఞనవసౌ♦రభ్యం బుపాసింప హృ
ద్భవనామోదము మీఱఁ బ్రాయ మనను♦ద్యానంబు పుష్పించినన్. ౩౨

మ. వలరాయం డలనీరుపాయ మను భ♦వ్యం బైనకాలంబునన్
లలనాదేహగృహప్రవేశమునఁ జ♦ల్పం దెంకెఁ గైసేయు త్రో
వలు నయ్యెన్ మణిగాసనంబు నవలా♦వణ్యంబుగాఁ, బైఁడికుం
డలుగా వత్సరుహంబులుం, గలువదం♦డల్ గాఁ గటాక్షావళుల్. ౩౩

కం. పొడమెను గుటిలత చూపుల, ముడి కొందనికురులు పాద♦ముల నటియించెన్
నిడు పయ్యె నంగదట్టము, నడుమంతరమందుఁ జిక్కె ♦ నడుమంతరమే. ౩౪

మ. జనయిత్రీచరణాభివందనము వాం♦ఛం జల్పి యేతెంచునం
తనె యాయాసభరశ్రమాలసత స్వే♦దం బూరె రక్తాబ్జఖే
లనజాతారుణిమంబు పాణి నిదె బా♦లా! పాయదే యంచుఁ దాఁ
గనఁగాఁ జేయు సకిన్ సతీమణియు వే♦డ్కం బాణిరక్తాబ్జమున్. ౩౫

వ. ఇట్లజ్ఞాతయౌవనయై చరించునచ్చంచలాక్షికి వివాహంబు గావింపఁదగినమనువు విచారించుచు. ౩౬

—* భానుమంతుఁడు కౌసల్యకు మనువు విచారించుట *—

ఉ. ఆనృపుఁ డొక్కనాఁడు విన♦యజ్ఞనయజ్ఞులు మంత్రు లోలి దు
ర్మానవిహీనవిజ్ఞజన♦మాన్యవివేకులు ప్రాడ్వివాకులున్
జ్ఞానవిశిష్టశిష్టులు మ♦నంబున భక్తిని గొల్వఁ గొల్వులో
మానితరీతిభవ్యగరి♦మన్ రహిమించి చెలంగుచుండఁగన్. ౩౭

తే. రాజకీయక్రియావిచా♦రంబు దీర
వివిధవార్తాప్రసంగంబు ♦ విస్తరిల్లఁ
దనదుకూఁతురు కౌసల్య♦కు నుచితంపు
మనువు నెమకంగఁ దలఁచి యా♦మనుజవిభుఁడు. ౩౮

వ. సకలదేశాధీశగుణాగుణబలాబలంబులు విచారించుచున్నతఱి దౌవారికుం డత్రి
రాక విన్నవించుటయు. ౩౯

—* అత్రి భానుమతుం జూడవచ్చుట. *—

తే. అరిగియెదురుగ నర్ఘ్యపా♦ద్యాదివిధులఁ, బూజనముసల్పికొలువంగ♦భోజనంబు
లోనికిని దెచ్చి యాసనా♦సీనుఁ జేసి, భక్తితాత్పర్య మెసఁగఁగఁ♦బలికె నిట్లు. ౪౦

తే. క్రూరదుర్వారసంసార♦ఘోరసంత, మసగహనసీమ బంభ్రమ్య♦మాణులైన
మాదృశుల్ దరియింపఁగ♦మార్గమున్నె, మీకృపాపాంగదీధితుల్♦సోఁకకున్న? ౪౧

వ. నిరంతర నారాయణనామపారాయణపరాయణులును నిష్కారణకరుణాత్ములు నాయు
ష్మంతులు నగు తా రిచ్చోటికి విచ్చేయుట నాయభ్యుదయకల్పకచ్చులు గడతేఱ ధన్యుండనైతి
నని యచ్చపుభక్తి విన్నవించి కుశలప్రశ్నంబు గావించి స్వాగతకారణం బడుగుట
యు మచ్చిక మీఱ మునివరుం డిట్లనియె. ౪౨

కం. నీబోఁటి నేలవేల్పుఁగ, మాబోఁటుల కేమిఁ గొదవ♦మానవనాథా!
రేబోటిమగఁడు వెలుఁగఁగఁ, గాఁ బొటిల్లదే చకోర♦కములకు ముదముల్ ? ౪౩

చ. కొదవలు లేవు మాకు నృప♦కుంజర! సుమ్ము తమంతఁ దార్పునై
వదలక వెల్తిగాక కల♦నప్పులన్నియు నున్న భవాదృశుల్
ముదమునఁ జూచ్చుచుండుటను ♦ మోదము మాకుఁ, దపస్సు లెస్స, మా
కదుపులు మేల, నిర్భయము♦కాననము ల్వనముల్ ఫలీడ్యముల్. ౪౪

కం. నీసేమ మరయ వచ్చితి, భాసురరవితేజ! యనిన ♦ బద్ధాంజలియై
కోసలవల్లభుఁ డనె నీ,దాసుఁడు మీదర్శనమున ♦ ధన్యుం డయ్యెన్. ౪౫

కం. నాపుత్రిక మునినాథ! స్వభూపుత్రసమానుఁ డైన♦భూనాథున కే
నీపట్ల నీయఁ దలఁచెద, నీ పనిచినయట్ల చెపుమ ♦ నిస్తులు నోకనిన్. ౪౬

వ. చరాచరంబుల మీమనోగోచరంబు గానిపరమార్థంబు లేదు. దయావంతులరై
మొఱఁగింపరే యని కౌసల్యను రావించి మ్రొక్కించిన నాశీర్వదించి. ౪౭

కం. ఆకూతం బెఱిఁగించెద, సాకేతం బేలునట్టి♦జనలోకధవుం
డీకార్యమునకుఁ దగు, లోకోత్తరచరితుఁ డతఁడు ♦ లోకారాధ్యా! ౪౮

వ. అతనిపురం బైనయయోధ్య మహిమంబును దశరథుబలరూపవిభవంబులు నీవె
ఱింగియుండుదు వైనను నిట్టికార్యంబులపట్ల వరునిగుణాగుణంబు లంత తెలియుంగుట
దగు నందు నీబాలారత్నంబు మదినెఱుంగుట యావశ్యకంబు గావున వివరించెద
వినుము మని యిట్లనియె. ౪౯

—* అయోధ్యాపురవర్ణనము. *—

కం. చటులభటాకుటిల ఘటా,పటలరటనదళితదిగ్వి♦భాగ మయోధ్యా
పుటభేదన మరిజనహృ,త్పుటభేదన మమరు నమర♦పురికిన్ సరియై. ౫౦

సీ. వీటులా చక్కని♦బాటలా కొమరైన, వేటలా పురలక్ష్మి♦వేట లగుచుఁ
దోఁటలా శృంగార♦పాటులా రొదసేయు, తేటులా సరసులు ♦ చేటులోలుక
లేటులా చిపురకను♦దాఁటులా కడిమిండి, చోటులా చేగట్టు♦వేటులంచు
బోటులా వారల♦నీటులా ముద్దుల, మాటలా సొంపుల♦మూటలగుచుఁ

తే. బాటలా వారిత్రాటులా♦ వీటులేని, కోటులా జాలమేటులై ♦ యోటులేని
ఘాటినా ఘోటులా ద్విజ♦కోటు లెన్నఁ, బోటిగనరాని సర్వోటి♦సాటిగలదె. ౫౧

కం. ప్రామినుకుల పెన్నిక్కలు, ప్రామినుకుల వేల్పులేమ ♦ రంగస్థలముల్
భూమిసురజ్యేష్ఠులవా, ల్బామి సురజ్యేష్ఠసములు ♦ పురమున విప్రుల్. ౫౨

చం. అపుర సహస్రశీర్షుఁ డగు♦నాదిఫణీంద్రుఁడు భామలందు వె
య్యవ దగుపాలు నాలుగవ♦యంశముఁ బూర్ణకళాఢ్యుఁ డౌ కళా
ధవుఁడును బోలుచుంద్రు వసు♦ధాబుధులర్; ద్విజరాజనామమా
త్రవశమె వారిఁబోల ద్విజ♦రాజసమాఖ్యము లేదె పక్షికిన్. ౫౩

సీ. కృతులిచ్చినను బహూ♦కృతులిచ్చుచుందురు, నతియొనర్చిన మహో♦న్నతిఘటింత్రు
వెలిచవి యన్నను ♦ వెలిమాలపనియంద్రు, ప్రజలనెల్లను దమ♦ప్రజలెయంద్రు
దవ్వుచేడెలచొప్పు ♦ దర్పణిఁ జూడరు, స్వారి పోవరు జారి♦ణీర తేచ్ఛ
నాడిబొంకరు వేఁడ ♦ నాస్తి యంచాడరు, దుష్టులతోఁ బొత్తుఁ ♦ దొలఁగియుందు

తే. రాజి నెదిరిన వీరారి♦రాజవరులు, రణపదమునను శమలందు ♦ గణనమీఱ
నొండువర్ణంబు మునుచేర్చ♦కుండవిడరు, వెలయునవ్వీటిలో రాచ♦కొలమువారు.

ఉ. మేకొని వేలనేకడఁగి ♦ మీఱఁగనేరఁ, డొసంగి యప్పులం
గైకొనలేఁడుగా ఘనులు ♦ గ్రమ్మఱ నీయకయున్న, మెండువో
కూఁక లటంచు నర్యవర♦కోటులు కంధి జడాశయుండు ర
త్నాకరుఁడే? యటంద్రుపయి ♦ నప్పతినైౕ కనుచుండ భంగముల్. ౫౫

సీ. కేదారముల నెల్ల ♦ భూదారములచేతఁ, గేదారములఁ జేసి ♦ కీర్తివెలయ
రా జనంబులు వేఁడ ♦ భోజనంబుల కిచ్చి, రాజసంబుల నిమ్మ♦రాజు లొసఁగి
కోటీశహస్తులై ♦ కోటీశు లౌచుఁ గి,రాటేశులకు నవ్వు ♦ పూఁటవడక
పాటీరపంకంబె ♦ పాటీరపంకంబు, శాటీరమ వరాశి♦సంచయంబు

తే. గాఁగ మాలుగుఁబోతులై ♦ కడఁకచెడక, రాలుగాయతనంబున ♦ రచ్చకెక్క
కఖలకృషికార్యములను స్వ♦యముగఁదీర్చి, శ్రీలఁ జెన్నారుహాలిక♦పాళియచట.

మ. ఘనవిఖ్యాతిని గాంచి యుండినను ద్రా♦గన్ క్షారనీరంబులే
మనకున్ దాపుర మయ్యె నంచు మదిఁ బ♦ల్మాఱాడుచు న్నబ్బు లీ
వనము ల్దీపి నెసంగె నేఁడు బళిరా ♦ ప్రాప్తంబు మే లంచు జీ
వనదోజ్జీవనదంబులై నపరిఖా♦వాఃపూరముల్ గ్రోలెడున్. ౫౭

చం. నిరుపమదానధార నవ♦నీరజముం బొడవాప సర్వముం
జరణములందు మేఘమును ♦ సాగరి మూఁత్రవణాంతికంబునం
దిరపుకొనంగ సిగ్గున మ♦దేభసమూహము లొప్పమీఱఁగాఁ
బురజనతావదాన్యగుణ♦ము న్వినుతింప వశంబె యేరికిన్? ౫౮

ఆ. సప్తసప్తిగుప్త•సప్తసప్తిరథంబు, మునుఁగు దాఁటలేక • వనధి నొంచు
నసుచు నగుచు సప్త•వనధుల దాఁటుట, సప్తినామ మొందె • జగతి హరులు.

కం.హరిహాయహాయ హరిహాయరథ
హరిహాయముల జవనగరిమ • సదటున గెలుచున్
హరిహాయ హరిహాయరథహాయ
హరిజిత్వరలీల నెసఁగు•హరు లాపురిలోన్. ౬౦

మ. గమనం బొక్కవిధంబ, చిత్రగతులం • గాన్పింపఁగా లేఁడు, వే
గ మనన్ జాములునాల్గు దోలును జుమీ • కంజాప్తుఁడన్వ్వన్, నిజాం
గ మనం బిచ్చకకుంటు, శాత్రవులుదాఁ•కం దేరి వేత్రోయు శ్రం
గమునందుండి పయోధి నంచు నగుదుర్ • క్షత్తల్ రవిప్రాజితన్. ౬౧

చం. సురపురసాలముం దవిలి • చుంబనకేళిని దేల్చుచుండు నా
పురవరసాలము ల్విపుల•పూగము లెక్కుచు వేల్పుటాండ్రతో
సరసులపజ్జఁ గ్రొంజిగురు•సజ్జలఁ బూవులసెజ్జ నాకముం
దరియఁగఁ దాపయాఁ బురము•తల్లికసాల మ టంచుఁ బల్కెడిన్. ౬౨

ఉ. గిరధిపప్రభావుఁడు భ•గిరథుఁ డుర్వికిఁ దెచ్చె నభ్రభా
గిరథిఁ జిత్రమా ? తలఁప • గిరథయాన లహార్మ్యఖంబులన్
సారతరాంజనైణమద•చర్చల మచ్చలువోవ నాడ జం
భారి విభాకరాత్మభవ • నాకము నేగతిఁ జేరనో యనున్. ౬౩

చం.లలనలకన్నుసన్నల మె•లంగు ననంగుఁ డనంగ నేలొకో
యలయక వాడవాడ మరు•నస్త్రుల నమ్ముచునుండు నెచ్చెలుల్
గలయఁ బ్రదక్షిణించు ఝష•లాంఛనునారులు గల్గునారులుం
దలముగ మారుమావుల న•దల్బెడిసాంకవగంధు లొప్పఁగన్. ౬౪

ఉ. గీతనినాదపూరితని•కేతనకేతనజాత మారు ! సా
కేతము డాయ వచ్చు సుర•కిన్నరముఖ్యుల దూరయానసం
జాతమహాశ్రమంబు సనఁ • జల్లఁగ వీచు ననంగఁ దత్పురీ
పూతజనాళియయ్యతిథి•పూజల మేర లెఱుంగ శక్యమే. ౬౫

చం.ఘనకురువిందవజ్రమణి•కాంచముల న్వెలసిల్లుగోడల
న్గొన బగుమేడలం దిరుగుఁ•గోమలు లావల నత్తలింబ్లకుం
జని యట రేలనిర్లు గని • చయ్యనఁ దర్జనిమోపి ముక్కునన్
గన మిది మాపురంబున న•నంగ నెగాదిగఁ జూతు రజ్జనుల్. ౬౬

చం.రస వగ్రాలఁ జాల మగ•రాల్ మొగరాలనిగారపుంబసల్
పొసఁగఁగఁ గ్రొంబసిండినును•బొమ్మలు బొమ్మలఁ బొమ్ముపొమ్మనన్

పైన జవరాండ్రపాట విను•వేడుకఁ జేరెడి వేల్పుఁగొమ్మలం;
గొసరుచు వారు పాట విని•గొబ్బున బొమ్మలె యాడు రచ్చటన్. ౧౭

ఉ. శ్రీలసితానిమేషకబ•రీమతులున్ లలితోరగాంగనల్
లోలవిలోకనాభినయ•లోపమునన్ వరనర్తనంబున
న్నా్రిలుపదద్వయీకలిత•రమ్యవిలాసవిహారహీనతన్
బాలిశ లంచు రెంట నుతి•పాత్రలు పాత్రలు వొల్తు రప్పురిన్. ౧౮

ఉ. సోరణగండ్లనుండి చనుఁ•జొక్కపుఁదావులధూపధూమ మే
పారఁగ ధూమయోను లయి•యాతపవారణరీతి వేసవిం
దీరయి సారసౌరభము • నెక్కొన ఘుంఘుమలాడు మంచిపు
న్నీరమువానలం గురియు • నిచ్చలుఁ జిత్తజుఁ బట్టనంబునన్. ౧౯

ఉ. ఘుమ్మనికమ్మవాసనలు • గ్రమ్మఁగ భూపచయమ్ము నెత్త గే
హమ్ముల ధూమ మాగడప•లట్ల రహించి నిదాఘువేళ ఛ
త్రమ్ములరీతిఁ బాంథులకుఁ • దాపముఁ బాపు ననం బరోపకా
రమ్మునఁ దజ్జనంబులఁ ద•రం బె నుతింపఁగఁ దమ్మిచూలికిన్? ౨౦

వ. అట్టిపురి కధినాథుండై. ౨౧

## అత్రి దశరథుని వర్ణించుట.

కం. దశరథుఁడు తేజమున ద్యో,దశరథుఁడు నితాంతరుచిర•తనుసుందరతన్
దశరథుఁడు సంతతార్చిత,దశరథుఁడు సుమహా ప్రతాప•ధన! కేవలుఁడే. ౨౨

మ. తను నర్థించినయట్టివా రొరులయొ•ద్దన్ వేఁడకుండంగ బల్
ధనముం గోరినవెల్ల లేదనక చే•తఃప్రీతిమై నిచ్చు నై
నను లోపం బొకఁ డేర్పడెం దనదుసౌం•దర్యంబునుం జూచు భూ
జనతాలోచనపాళి కెయ్యెడలనే • సంతుష్టి లేఁ డియఁగన్. ౨౩

ఉ. ఆధరణీశనందనశ•తాంగరథాంగహతి న్మణీమయ
జ్యాధరముల్ దిశాంతముల • హల్యము లైచన జొన్నఁజల్లి యా
శ్మాధరవాసు లాజనులు • మంజరులం గని యారరత్నభూ
మీధరజాతసస్యములు • మేలిమణుల్ సుమి యంద్రు నివ్వెఱన్. ౨౪

ఆ. రాజు సారసహిత•తేజుని దమిఁ గనుం,గొనినమధ్యలోక•కుముదనయన
లెల్లఁ గనులపూఁత•లెప్పుడుఁ బెట్టరు, తలఁపు నిలిపి వలపు•కలిమిబలిమి. ౨౫

తే. వసుధఁ బర్జన్యనిభు నర్క•వంశ్యుఁ జూచి
దరము లజ్జయు నొదవంగ • శర ణటంచు

నగ్ని రవిఁ జొచ్చెఁ గావఁగ♦దా జనంబు
లగ్నిగర్భుఁ డటందు రా♦యగ్నిగర్భు. ౭౬

ఆ. మొగఁడు దన్నుఁ దిట్ట ♦ మగువ బిడ్డను గొట్టు, చంద మతనిశత్రు♦చయమువిధము
వానిబాణనిహతి ♦ మానిదేహంబు సై,లింపసతులఁ బొట్టు♦బరపుఁ జూడ. ౭౭

చం. తరణికులావతంసునిప్ర♦తాపము మించె నమిత్రరూపమై
యరుల కదేమిచిత్రమొ, సు♦దారినృపాసితపద్మలోచనా
హరిణమదాంకసక్తహరి♦ణాంకసమంచితతుండమండలం
బరరె! మృగాంకరిక్తధవ♦ళాంశురుచి న్వెలుఁగొందె భూవరా! ౭౮

వ. అట్టి జగద్వినుతు భవదీయజామాతఁగా నొనర్పుమని ౭౯

మ. మునిసంక్రందనుఁ డిట్లు పల్కిన మహా♦మోదంబు సంధిల్లఁగా
జనపాలాగ్రణి భక్తిఁ బల్కె భవదా♦జ్ఞప్తిం బ్రవర్తింతు, నా
జననంబుల్ సఫలత్వ మొందెను భవ♦త్సందర్శనప్రాప్తి మీ
యనుకంపార్హుఁడ నౌట నంచుఁ బలుమా♦ఱాడంగ మౌనీశుఁడుల్. ౮౦

వ. వారల వీడుకోలు వడసి యాశీర్వదించి చన్నట్టియుఁ గౌసల్యయు, దశరథుండ తనకు మనోనాథుండుగఁ దలంచుచు నతనియంద మనంబు నిల్పి తత్సంగమంబుఁ గోరుచుండె. ౮౧

## వసంతఋతువర్ణనము

ఉ. అంత నితాంతకాంతసువ♦నాంతదురంతలతాంతసౌరభా
క్రాంతదిశాంతవంతము, ప్ర♦కంపితకాంతవశింజినీవిభా
సంతము, పాంథకృంతనని♦శాంతకుహూకలలోలమత్తవా
సంతము, గాయనాదృతవ♦సంతము, దోఁచె వసంత మయ్యెడన్. ౮౨

సీ. చైత్రవనేందిరా♦సంగమవేళ విభ్రష్ట మహామకరికా♦పత్త్రిము లన
రా మాధవుఁడు వన♦రమ గయిసేయ జా,ఱఁగనూఁకు చ్ఛ్రాఁబచ్చ♦ఱవిక లనఁగ
వసుమతీజోరుజ♦పాళులు వెలిఁజూపు,చెలువై నయపరంజి♦పలక లనఁగ
విటవిటీతతులకై ♦ విటపచేటులు రక్తి, హత్తిన నునుమెత్త♦మెత్త లనఁగ

తే. నింపుమతి దండనుండిన♦దండిపక్కి,దండములగుండెదిటమెల్ల ♦ బెండువడఁగఁ
బండుటాకులువనినిండ♦మెండుకొనిమె, నొంటికొమ్మలుచెలువేది♦యుండనపుడు. ౮౩

ఉ. చెల్లుటఁ గాలమెల్లఁ దముఁ♦జేరెడుపైకములెల్ల జాఱు, సొం
పెల్లను మాయఁ, బత్త్రిము ల♦దృశ్యముగాఁగను, బంస్లు వాయుటం
బల్లవవర్జితం బగుచుఁ ♦ బాంథవిగర్హితమై యహృద్యమై
వెల్లడిగాఁగ వార్ధకపు♦వేశ్యలసంచునఁ గొమ్మ లొప్పినన్. ౮౪

సీ. అగము లగము లౌటఁ దగ నట నిట జగ, జిగి మీఱు తొగరాల వగ లనంగ
నవయౌవనము పరిభవిలంగఁ గొమ్మల, మొగములఁ జెలువారు మోటిమ లనంగ
విరహిణీమర్మవిభేదనం బొనరించి, కడుఁ గనిమరు ముల్కి కదమ లనంగ
మాధవు రాకకు మదిని గొమ్మలు పూను, స్మరశాతశిఖశిఖాంకురము లనంగ

ఆ. నొగరుపొగరు దగుల జగడాల బిగిఁ గ్రాలు, మగువ లెదల దిగులు బుగులుకొనఁగఁ
దొగరువగలు మిగులు జిగులు పెంపొలయుంగఁ, దొగరుఁ జిగురు లలరెఁ బగములందు.

సీ. చిగురులో యివిగావు మొగరంబ మరుపొగ, చెలువారు స్మరదీపశిఖలు గాని
తలిరులో యివి గావు తరుణభూజనశాఖఁ, గమనీయ మగు మేల్నఖములు గాని
యిగురులో యివిగావు మగసంచు బిగికంచు, కముఁ జించు మరుముల్కి గములుగాని
ననలొకో యివి గావు ననుపాయ మదిఁ డాయఁ, గరు గొమ్మల నుజూచు కములు గాని

తే. యనుచు జనములు పొగడంగ మొనలు సూపి, నిక్కమొప్పున విచ్చుచు నిగ్గుమీఱి
తొగరురుచిదక్కి జొంపమై వగలు చెలఁగె, ననలు కుజములకొమ్మల కొసలయంపు.

ఉ. మావులు మారుమావులకు మందురలై విలసిల్లెఁ; బెల్లునె
త్తావులతావు లైనసుల తాతతిడోలల నూఁగి పువ్వవి
స్రావిమధూళికాధునుల సారెకు నీతలుగొట్టి తుమ్మెదల్
దీవెలరాలుపూలగుమి దీవులఁ బాపుకొనెన్ శ్రమంబులన్. ౫౭

శా. గండుంగోయిలకూయుకూఁకలును, వీఁకం గేరు లీలోకమున్
నిండన్ వేసెడుబిగ్గకేకలును, వానిన్ మించఁ గీరంబులు
ద్దండత్వంబునఁ జూపుడాకలును, మాద్యద్భృంగముల్ జోకలున్
గండా లందురు మారుకాఁక లెద సోఁకం గామిసీకాముకుల్. ౫౮

ఉ. కూర్మిని నోలలూఁచి, యొకకొమ్మను వృంతములంటి, యొండు వో
నర్మిలిఁ బద్మినిం గదిసి యాడి రతి, స్సరిన్ ఘటించి పే
రూర్మిక లొంద నొక్కతెను నొక్కెతపాదపరాగ మూనుచుం
బేర్మిఁ జరించె దక్షిణసమీరకుమారుఁడు జారుఁడై నడిన్. ౫౯

ఆ. పొదలఁ బొదలఁ జిల్క సొదలు కోకిలముల, మూఁకమూకరుతసము మూలఁబడఁగ
నలరు లలరఁ దుమ్మెదలు దలమీఱెనె, మ్మదులమెదలువాఁడు కదలె దాడి. ౬౦

సీ. ధర్మశుద్ధాంతకాంతాగీతములఁ జొక్కి, మకురునఁ దేజి మాన్మలయు చున్న
మలయాద్రిచెంచుచెల్వల చేతిధనువులఁ, జూచి పూఁబోదమాటు సురుఁగు చున్న
ద్రావిడీమందిరారామసీమల నునుఁ, బచ్చికకై మెడ ద్రాల్చు చున్నఁ
గర్దమితంబు లౌ ఘనవనదీమాతృక, కేదారములఁ గాలు పాదుకొన్న

తే. మడిమలను దాఁచి హైఁయని కడునదల్చి, మెడను నిమురుచుఁ దట్టుచు జడుపు దీర్చి
వాగె బిగియించి, కాల్నడ వచ్చుకతనఁ, జెందెఁ బృషదశ్వుఁ డావేళ మందగతిని.

ఉ. ఓలి రసాలసాలముల ♦ నుయ్యెల లూఁగుచు, మూఁగుచున్నహిం
దోళచయంబులం గసరి♦తోలుచుఁ, గంఠము లెత్తి రక్తిహిం
దోళముఁ బాడ బాలలు కు♦తూహలితం జెవి నిక్కవెట్టుచున్
హాళిఁ గురంగ మేగమిఁ గ♦దా! పవనుండు చరించు మెల్లగన్. ౯౨

ఉ. తమ్ములఁ గంపు లూరె, సుర♦తమ్ముల నింపులు గూరె, మీఱి ద్యో
తమ్ములపెంపు గేరె, లలి♦తమ్ములఁ దెంపులు తారె, ధీలతాం
తమ్ముల సొంపు చేరెఁ, బరి♦తమ్ముల చిక్కలముద్దుముద్దుగీ
తమ్ములజొంపు మీఱె, హసి♦తమ్ములతంపులు గీఱె భోగులన్. ౯౩

చంచరీకావళీ వృత్తము.

వ్రాలుం బూలన్ లీలం ♦ ద్రాగకే తేనె వానం
బోలం జుంజుమ్మంచుం ♦ బోవు నన్యప్రసూన
స్థాళిన్ రేఁచున్ జోపున్ ♦ హాళి మూచూచు నూఁగుం
జాలం గేళిం దీఁగెం ♦ జంచరీకాళు లిచ్చన్. ౯౪

ఉ. కంధర మానుచున్నతమ♦కాన సుగంధివినూతనాబ్జినీ
స్కంధసుమాసవంబు గొని ♦ కాంతలతాంతగుళుచ్ఛవీథిఁ బు
ష్పంధయము ల్పరాగముల ♦ సారెకు ధూసరితంబు లౌచు గ
ర్వాంధతఁ బొల్లుఁ బాంథజన♦తాహితతీవ్రకటూక్తి నించుచున్. ౯౫

ఉ. పూలను వ్రాలుఁ దేనెఁ గొన ♦ మూర్కొను ఝుమ్మని యేగు వెండియున్
వ్రాలును లేచు బమ్మెరను ♦ బైపయిఁ జుట్టులువెట్టు నొండొక మ
త్తాళి మధూళి నానఁగ ర♦యంబునఁ బైపడి పోరు సల్పు హిం
దోళ మొకండు; నిల్కడకు ♦ దూరగులే గద చంచలాత్మకుల్. ౯౬

ఉ. జాతులు సిగ్గులుం జెడఁ, గు♦జాతు లనూనవిలాససంపదు
జ్జాతములై చెలంగఁగ, వి♦జాతులనాదము మిన్నుముట్ట, హృ
జ్జాతకలిప్రభావమున ♦ సత్త్వవికాసము డిందఁగా, మధూ
ద్భూతగుణప్రవర్తనము ♦ పొల్చి కలింబలె నొప్పె నామనిన్. ౯౭

ఉ. మూకులకీలి నున్నయళి♦మూఁకల నిద్దుర లేపి, నిద్దపుం
బోఁకల గుజ్జుమావినను♦మోకలఁ బాపము మోపి, వీఁకఁ బల్
పోకలఁ బస్మిపేజనవ♦పుష్పము వాఁకిని బాపి, మీఱు వే
పోకల వేగుఁబోకలను ♦ బోకలరాకలఁ జల్లఁ దెమ్మెరల్. ౯౮

తే. పుడమిని విహారమహ మెల్ల♦కడలఁ జెలఁగ, నవనవసుగంధయుక్తి న♦నారతంబు
దక్షిణాశఁ జరించెను♦దవిలి ముసలి, ఛాందసుండన బవనుండు ♦ మందగతిని. ౯౯

వ. ఇట్లు నిరంతరకాంతవకుంతలతాంతసురభితనిశాంతంబును, నశ్రాంతపథికాంతకాశాంతరతికాంతసంతతప్రకంపితగుణారవద్విగుణీకృతాక్రాంతదిగంతవాసంతకలకలశ్రవణవిస్మృతేతరోదంతంబును, రతికాంతరణతాంతవినికృంతననిశాంతహిమవాసంతభాసంతంబును, మాకందమందారబృందారవింద నిష్యందమకరందబిందుసందోహపానానందనటత్తుందిల మిళింద కందర్పమదావిలమదావలకులకోలాహలసమాకులంబును నైవదావళు లగుశిఖావలంబుల రోదాళంబుల హాళాహాళికి నళికి బెళికి కులుకులందళుకులంగొలంకుల కెలంకులం జిలుకలపలుకుల ములుకులుగ నులుకుకులుకులాంతుల కలికిపలుకులును, నల్లిబిల్లిగం బెల్లుగ నల్లుకొనినమల్లికావల్లి కామతల్లికాదుల వేదుల సల్లలితసంఫుల్లలతాంతంబుల దినాంతంబుల శాటీపాటీరంబులం బాటనచేసి పాటవంబు మీఱం బాటపాటపాటల బిటారంబుల మిటారులు మొలనూలిగజ్జియలరవళి రవణింప లీలాహల్లీసక కేళీలోలలై యింపుసొంపార నటింపం దన్ముఖనయనాభినయవిలోకనేహాపరత్వంబునం బార్శ్వంబునకుం జాఱినాం బింపిణీ లూరుయుగంబుల మార్చి మార్చి నృత్యంబుసలుపం దాలఫలవిభ్రమభ్రమకారు లగుపయోధరంబుల నాచ్ఛాదించుజాఱుపయంటలసందుసందున సితపయోధరంబుల దృశ్యం బగుచిరద్యుతుల శోభ ననుకరించు నిగన్నిగ మనుకనకమణిహారకాంతులు వదనేందునకుం బరివేషంబులం గల్పింప విరళంబు లగుకురుళంబులు బంభరడింభంబులువోలె సంరంభింప, వానివదనంబులనుండిరాలుమధుబిందువులునాం గర్పూరతిలకితముఖంబునం బుటమరించుఘర్మబిందువులు జాతి హరిచందనపత్త్రభంగచిత్త్రరంగ మైనకపోలముకురంబుల వజ్రస్థగితసువర్ణఫలకంబులుగను, వక్షోదుకూలంబుం జకోరికాకబళనవిర్వ్యథితరాకాసాంద్రచంద్రికాపూరంబుగ నొనరింపం గేళికాయాసభరంబునం బైపైవచ్చుదట్టంపు నిట్టూర్పులు నెట్టికొనిరా మిట్టిపడుచెనుమిట్టలు మిట్టిపడి యడంగం, దత్తనువల్లులం గొల్లలుగ వెల్లువలై జల్లుచెమటల నటమటగిటగిటనగా వాడపీవలి వీవనల వీచెనా జంపాడువిశాలరంభాపత్త్రంబులును, విరిపోటులెంచక యిరుపోటుల విరిపోటు లెంచి విరివాసివచ్చిన గాసినిడ నదనని యెద సని మదనుండు శరఘాతంబుల విశరఘాతంబు సేయు నని వెరవేఁకివేఁకరంబునం దమవెంట వెంటముకై మసపసమెఱయు మసకమెసక మెసంగ మఱుసంజలవల్లభులం దోడుకొని యారజంబుపెంపుటారజంబులనీరజంబుల ననసీరుగ్రోలిమదావలంబులై వదావళు లగుసమదాళులవళావళుల కలుకు మృణాలజాలగ్రసనలోలమరాళంబుల సరాళంబు లగుకేళాకూళులం గేలీలోలలై, మాందాళి చీరలుధరించిహావణించిన కొమ్మలగతి మిసమిసలాడు కవటాకులటాకటీకు గల కొమ్మల చాయలనుల్లసిల్లి జగతుల శతపత్త్రంబు సహస్రపత్త్రం బైన నీవిరివాసివచ్చునే యని మెచ్చుగొలుపు నవనవశిరీషకుసుమవిసరశయనతలంబునం బరవశ లగువశాగమనలును, రహింప నందంబుమీఱు నావసంతసమయంబునం గౌసల్యాబిబ్బోకవతి నిబ్బరంబులేక మారునిదెబ్బలకుం దబ్బిబ్బులాడుచుం బ్రబ్బినచింత విరహవేదనాదూయ

మానమానసయై చింతిలుచున్నసమయంబున నెచ్చెలులు తచ్చరిత్రిం బెఱింగి వనంబున మెలంగినఁ గాక యీకాఁక పోకడపెట్టఁజాలమని బాలమనికితంబుఁ బాప జాలమే లని జాల మేలని మేలంపుమాటల పాటలాధర లారామ నారామంబునకుం దోడ్కొని చనుటయుఁ గౌసల్యాదేవియు నెచ్చెలితోడఁ దిరుగుచుండ నచ్చటివిశేషంబులు ముచ్చటమీఱ ముచ్చటింపఁ దలచి వయస్య యి ట్లనియె. ౧౦౦

## కౌసల్యాదేవీవనవిహారము.

ఉ. అల్లదె! యల్లిబిల్లిగను•నల్లిసమల్లియతీవెలందుఁ జైఁ
బె ల్లగుపూవులం గనుమి • ప్రేయసి! నీయునఁగప్పునిప్పు నా
నుల్లమునందు నెంతు, నది•యొప్పును బాంధుల వాడఁజేయుటన్
వెల్లడిగా హసంతి యను•పేరు వహించుట గ్రొత్తలే చెలీ! ౧౦౧

శా. ఝుంకారస్తననార్భటీస్ఫుటితది•క్శైలంబులై ఫుల్లస
త్పంకేజాతమరందపానరతస•క్తస్వాంతయుక్తిన్ నిరా
తంకారంబున వచ్చుషట్పదములన్• దర్శించి నూత్నాంబుభృ
చ్ఛంక న్మేను వణంకఁగా మరుఁగుహాం•సం జూచితే భామినీ! ౧౦౨

చం. నిరుపమకోమలాంగి! ధర•ణీరుహముం గనుమా శిరీషమున్
సరసను జేర నీవు వయి • జల్లున రాల్చెఁ బ్రసూనజాలమున్
స్థిరవరపేశలం బగుత్వ•దీయశరీరముఁ జూచి పూలచే
నరుదుగఁ బూజసేసెనొ; మ•హాత్మకు లన్యగుణజ్ఞులే కదా. ౧౦౩

చం. కుజదళపాళి రంధ్రములఁ•గూరిచి తూఱిచి నార నందు న
క్కజముగఁ బీచుపోఁచలను • గట్టుచు లోఁ గదియుండ దాన స్వ
ప్రజకయి జ్యోతిరింగణము•వక్షతిఁ బంకమునన్ బిగించి పె
న్గజబిజి నల్లియున్న గిజి•గాఁడులగూఁడులఁ జూడు మక్కరో. ౧౦౪

కం. సౌరభవర్జిత మయ్యును, జారుతరం బయ్యెఁ గనఁగ • జలజాక్షీ! వి
ద్యారహితుం డైనయలం,కారపువిద్యార్థిఁ బోలి • కను కింశుకమున్. ౧౦౫

కం. మాధవసంగమవిలసిత,రాధోల్లాసంబుఁ గాంచి • భ్రమరారభటిం
గ్రోధముఁ దెలుపుచుఁ గనుమా, మాధవి విలసిల్లె రక్తి•మహితాననయై. ౧౦౬

ఉ. వాడఁగఁ గర్ణపూరములు • వ్రాల మహోత్పలపత్త్రిరాజి, దో
పాడఁ జలించుచున్ భ్రమర•కావళి, వృంతము లింత నల్లఁగా
వీడ లతావలేప, మట• వింత బెడంగు రహించుపద్మినిం
జూడ సఖీలలామ! మది•సొక్కెను నీ కదియేమి చెప్పవే? ౧౦౭

ఉ. ఆతపతాప మోపికను నాఁపి వడింబడి పెన్జడిం దనూ
జాతఘనశ్రమం బెడల సారసుమాంచితసద్రసంబు మైఁ
బ్రీతిగ నంటుకోఁ జెలువ పేర్మి హిమాంబులఁ దోఁగి తాలిచెన్
నూతనపత్త్రిరేఖలఁ గనుంగొను కొమ్మ లనాహతద్యుతిన్. ౧౦౮

వ. అన యిట్లు తనయనుంగునెచ్చెలి యందలియందంబు నందంబుగా మందలించుచుండఁ గనుంగొనుచు. ౧౦౯

చం. *వికటపలాశివారముల వేడ్క శరంబుల ముంచి, జింకకై
ప్రకటితరీతి నేగి, యెడఁబాసిననిష్టవయస్యఁ జీరుచున్
శుకముల కుల్కుచుం, దనకుస్రుక్కినపక్కని నాదరించుచున్
నకి యొసఁగన్ ఫలోత్కరము సాపముచుం గడుసంతసంబునన్. ౧౧౦

ఉ. *కోమలపల్లవావళులు గోయుచుఁ, గాకవిపెంపు మాన్పుచున్
శ్రీమయపర్ణశాలల వసించి, మహాశ్రమమారసుందరా
రామముఁ జేరి తానబలరక్కసినాసను గోయఁ బంప నా
రామవిహార మీగతిని రాజిత మయ్యె వనాంతరంబునన్. ౧౧౧

వ. ఇట్లు గ్రుమ్మరుచున్న సమయంబున సంధ్యాకాలంబు డాయుటయు వనవిహారంబు చాలించి పురంబుఁ జేరఁ బోవుదము రమ్మనినఁ గౌసల్య రాకమంజుకుంజంబుల సుమపుంజంబులకై తిరుగుచున్నఁ జెలి బెదరింప వయస్య. ౧౧౨

కం. అవరాజకీరమతి నీ,సవురున బింబోష్ఠి! తిరుగ సయ్యాటమునం
గువలయనాథుఁడు దోఁచెడి, నవలా! నవలాఘువంపునడ రావమ్మా. ౧౧౩

శా. రామానూఢవ్రుఁ డుండు నాసరసఁ బోరాదమ్మ, యీపూఁబొదన్
భామా! తామరసాంబకుం డు మెలఁగున్ వల్దన్న వే పోయెదో
శ్యామా! భూపకుమారకుం డచటనే సాక్షాత్కృతిం దోఁచు నీ
సీమాటీకన మేల మే లటవె యో సీమాటి! ముమ్మాటికిన్. ౧౧౪

వ. అని పలికిన దశరథుండు చెలి తన్ను వీక్షించి హెచ్చరించుటకాఁ దలంచి తన డాఁగినకుడుంగంబుమాటు వీడి తటాలున వారియెదుర నిలుచుటయు. ౧౧౫

## కౌసల్యాదేవి దశరథుం జూచుట.

సీ. జిగిబిగిరుచులచేఁ జెలఁగుపుండ్రమువాని, వలెవాటు గలపోన్ను వలువవాని
నెగయుమూఁపులతోడి సొగియురూపమువానిఁ, గమనీయజలజాంబకములవాని
మృగరాజు నిరసించు మేలిమధ్యమువాని, సరసవిశాలవక్షంబువాని
డంబుమీఱఁజేయట్టి కంబుకంఠమువానిఁ, గామనీహృద్యవిగ్రహమువాని

తే. భూపతనయుని దశరథు ♦ దాపునందుఁ, జూచి తిలకించి పులకించి♦సొక్కి తెలిసి
కలఁకవాఱినమనమునఁ ♦ దెలియలేక, మదనుఁడనుచును భ్రమసెను♦ మదిరనయన

వ. ఇట్లదాటున దాపున నిలిచిన దశరథుఁ జూచి జంకె శంకించి ధీరోదాత్త గావున
భావంబు బయలుపడనీయక.

ఆ. నిరుపమాన తేజు ♦ నిస్తులరతిరాజ, రాజితాంగుఁ జూచి ♦ రాజవదన
రాజసమునరక్తి♦రాణించుమాడ్కి నీ, రాజతాంఘ్రుఁ జేసె ♦ నోజ మెఱయ ౧౧౮

—✻ కౌసల్యా దశరథుల సంభాషణము ✻—

ఉ. అందముమీఱఁ గాంత విన♦యంబు నయంబు రయంబు దోఁప రా
కేందునిభాననున్ వరమ♦హీపతిగాఁగ నెఱింగి భూపసం
క్రందన! యల్ల సత్కుసుమ♦రాజితపీఠిని విశ్రమించి మా
యందు ననుగ్రహించి చరి♦తార్థనుగా నొనరింపుమా దయన్. ౧౧౯

ఉ. నీతముగాఁగఁ గ్రొత్తనవ♦నీతముకన్నను పేశలంబునౌ
నీతతకోమలాంఘ్రినవ♦నీరజయుగ్మము నింతదవ్వు యా
నాతతకారణాకలిత ♦ మౌనటు లేల యొనర్చె డెంద? మా
హా తెలిసెన్ మము న్మిగుల ♦ నాదరయుక్తులఁ జేయనేకదా. ౧౨౦

చం. నినుఁ బతిఁగా వరించి ధర♦ణీతరుణీమణి యేపురంబునం
దనయము హాళి మీఱెడినొ ♦ స్వచ్ఛసువర్ణపుఁ బేరునందు ర
త్ననికర మట్లు నీదుశుభ♦నామమునం జతురత్వమందె నే
వినుతమహాశు రాళి? పృథి♦వీవర! వీనులవిందు సేయుడే. ౧౨౧

ఉ. ఏమినిమిత్త మెచ్చటికి ♦ నెచ్చటినుండి మహాత్మ! పోవుచో
నీమహిఁ జేరవచ్చితి వి ♦ టీవనిసొంపుఁ గనంగ నొక్కొ? యా
రా! ముఖకాంతిసుందరత♦రాజకుమారకలక్షణంబు లు
ద్దామముగాఁగఁ దెల్పెడు య♦థార్థము చెప్పుమ చెప్పఁగూడినన్. ౧౨౨

చం. ఇది ప్రమదావనంబు పృథి♦వీశ్వర! దక్షిణకోసలుండు ధీ
సదనుఁడు భానుమంతుఁడు ప్ర♦శాంతుఁడు తద్ధరణీశుపుత్రికన్
హ్లాదిని విహారకేళిఁ జరి♦యింపఁగ నాన జనింప నేఁడు మే
లద నని వచ్చినారము సు♦మావచయం బొనరింప నింపునన్. ౧౨౩

వ. అని యూరకున్న నయ్యన్నులమిన్న మృదుమధురవచశ్చమత్కారంబునకు నల
రుచుఁ గల తెఱం గెఱింగించువాఁడై. ౧౨౪

—* ప్రియకాంతావృత్తము. *—

అనితివి నీవే తెలియ సు♦మాంగీ! సకలం బై
నను నెఱిఁగింతు న్విను కల♦నాదామణి! ప్రీతిన్
ఇనకులజాతుండ దశర♦థేశాఖ్య జనుల్ న
న్ననుదు రయోధ్యాపుర మిర♦వయ్యెం బ్రియకాంతా. ౧౨౬

—* స్రగ్విణి. *—

దిగ్వితానంబులం♦ దేజ మిాఱంగ స, మ్యగ్విభూతిం జమూ♦మండలంబొప్పఁగా
స్రగ్విణీ! పోవుచున్♦శ్రాంతికై మానిరా,డ్వాగ్విధిన్నిల్చితిన్♦భామకర్జంబునన్.

—* మానిని. *—

మానిని! నీయసమానవిలాసము♦మాన్యగుణంబులు పెక్కుజను
ల్వీనులవిందుగఁ జెప్పఁగ విందు, స♦లీల నిను న్వరియింపఁ గదున్
మానస ముఱ్ఱట లూఁగుచు నుండఁగ♦మానితవృత్తిని నీజనకున్
దానముగా నిను వేఁడుకతంబున♦దాపున! నిల్చితి సేనలతోన్. ౧౨౭

—* వనమంజరీవృత్తము. *—

అలమినసంజ వనాంతరవీథుల♦హాయి నొంటిగఁ గ్రుమ్మరం
దలఁపు జనింపఁగఁ బోవుచుఁ గోయుచుఁ♦దన్వులున్ వనమంజరుల్
కలకలనాదము కర్ణరసాయన♦గౌరవంబున నింపఁగా
హాళహాళికం గన వచ్చి కుడుంగప♦దాంతరంబున డాఁగితిన్. ౧౨౮

—* కుసుమితలతావేల్లితము. *—

అందం బొప్పంగాఁ బ్రియసఖియు నీ♦వర్మిలి న్ముచ్చటింప
న్విందుం గందుంగా కుసుమితలతా♦వేల్లితం బైనకుంజం
బం దిం దున్నన్ డాఁగి యని నిలువన్♦హల్లకాక్షీప్రబోధం
బొందాఁ బల్కాడన్ జలజవదనా♦పూని నీతోడ నంచున్. ౧౨౯

తే. ఆడఁబోఁ దీర్థమెదు రైన♦యట్లు చెలువ! వెదకుతీఁగియ పదములఁ♦బెనఁగి నట్లు
నాదుభాగ్యంబు పెంపున♦నళినసయన! వచ్చితివికాన వచ్చితి♦ముచ్చటింప. ౧౩౦

—* తోదకము. *—

మానిని! ని న్గన♦మానసమందున్, మానసజాతుఁడు♦మానని వీఁకన్
మానముదూలఁగ♦మార్గణపంక్తిన్, మానకచిమ్మెఁ జు♦మా ననుఁ గాంతా.

చం. ధరణిఁ గలట్టిరాజులను ♦ దద్దయు మార్కొని వీరవిక్రమ
స్ఫురణను బోర గెల్చి పుర♦పోణిరో! నీదుకటాక్షపాతవి
స్ఫురణ సహింపలేక మది♦పొంగు చొలంగి మొగుడ్తుఁ గేలు దు
ర్భరసుమబాణబాణవిని♦పాతనభీతుని నేలు కోమలీ. ౧౩౨

ఉ. వింటి భవత్తనూరుచిర♦విభ్రమరూపవిలాససంపదం
గంటిని గంటి కామెతగఁ ♦ గాంతరో! నేఁ డిటనుండి, యంతఁ బూ
వింటివజీరు నాదువెను♦వెంటను గొంటుతనాన దంటవా
ల్గంటిరో! గెంటఁగాఁ దొడఁగెఁ ♦ గాండముల న్గసుఁ గంటగించుచున్. ౧౩౩

ఉ. మోహముఁ బెంచె నీకురులు ♦ మోమువికాసము దెల్పెఁ దెచ్చె, సం
దేహముఁ గూర్చె నీనడుము ♦ నిశ్చయనిశ్చలగౌరవంబు నో
మోహిని! నీగభీరతయె ♦ పొందుగఁ దెల్పెఁ గరంబుఁ బ్రీతి నై
వాహికకేళిఁ దేలుపఁగ ♦ స్వాంతమునం దలపోయు భామినీ. ౧౩౪

వ. అనినఁ గౌసల్యయు. ౧౩౫

ఉ. పూరుషు లిట్లు రాఁ జనునె ♦ భూధవపుంగవ! కాననాంతరో
దారఫలప్రసూనకిస♦లావచయాదికకేళికారతిన్
హారివిహార లైనజల♦జాస్యల వంచనఁ బొంచి కాంచుటల్
సూరకులావతంస! యిది ♦ చోరునికర్మమొ శూరధర్మమో. ౧౩౬

కం. కులకన్యను గానా? పెద్దలు లేరా నాకు? నిపుడ ♦ ధరణీశా! నీ
పలుకులు జనకుఁడు వినినను, బెలుచనఁ జేసేత ననుభ♦వింపఁగ నిచ్చున్. ౧౩౭

వ. అని కానికోపంబు దోఁప మాఱుమొగంబు వెట్టుకొని నెచ్చెలిం గూడి నిర్విఘ్న
టన్నై వేఱుమార్గంబునఁ జనునెడ. ౧౩౮

కం. పదములు మును చనఁ జూచున్, మది వెనుకకుఁ బాఱిపోయి ♦ మరలఁ దమఱికన్
స్తుపచూపు మధ్యవర్తి యయ్యె, పదురుచు వెనుకకును బోయి ♦ వచ్చుం బోవున్.

వ. ఇట్లు పోగమకించుపదంబులఁ బోనియ్యనిమనంబుతోఁ దిరిగితిరిగిచూచుచు నేటి
కెదురీఁదువిధంబునఁ జనుచు దశరథుం డనంతరథుం డైనపగిది భావనాబలవిశేషం
బున నెచ్చటఁ జూచినఁ దోఁచుటయు. ౧౪౦

ఉ. ఎచ్చట విన్న మారహయ♦హేషలె, యేయెడఁ గన్న ముల్కులే
యెచ్చోటఁ జన్నఁ దద్రథమె ♦ యెక్కడ నక్క విజాతికూఁతలే
నచ్చికమార ధృష్టశకు♦నంబులె యెల్లెడఁ గానవయ్యె, న
న్నిచ్చటి కేల తెచ్చితిరె ♦ యింతులు! కంతునిశస్త్రశాలకున్. ౧౪౧

వ. అని తనమనోవికారంబు దేటపఱుచుటయు నెచ్చెలి తదనుగుణంబుగా. ౧౪౨

సీ. సారసోదారకా♦సారంబు గాదమ్మ, మారనారాచతూ♦ణీర మమ్మ
యంద మామాకంద♦బృందమ్ము గాదమ్మ, కందర్పమందురా♦బృంద మమ్మ
వలిపెంపు గల్గుపే♦వలిగుంపు గా దమ్మ, యంగజధాటీశ♦తాంగ మమ్మ
గంఘుమిాఱినచిల్క♦దండంబు గా దమ్మ, దండిమారుపటాణి♦దం డి దమ్మ
తే. రవణమిాఱఁగఁ గోయిల♦రవళిగాదు, రతిమనోహరభటమహా♦ర్భటులు సుమ్మ
కాన నీకానలో నేక♦తాన మారు, నాన తిరుగంగ రాదమ్మ♦మానవతికి. ౧౪౩

—* సాయంసమయవర్ణనము. *—

తే. అపరదిక్కాంత గై సేయు♦నాశయమున, రాగమలరారుచుండ సం♦ధ్యాగమమున
ముఖముననుబెట్టు కుంకుము♦బొట్టనంగ, వెలయుభానునిఁ గంటివే♦జలజనయన!
ఉ. వాసకసజ్జవోలె నిజ♦వల్లభురాకను రాక కొప్పుఁ ద
న్వీ! సవరింప నెత్తుకురు♦విందమణీకృతహ స్తయుగ్మసం
భాసితదర్పణద్వయము♦భాతి నిశాముఖమందుఁ గంటివే
వాసరయామినీధవులు♦భామిని! నిల్వఁగఁ బ్రత్యగంబునన్. ౧౪౫
తే. జలజకుసుమంబు తింత్రిణీ♦దళముభంగిఁ, బగల వికసించునింతియ♦పద్మనయన?
ప్రాగ్దుదిరుగుడుఁబువు రవి♦పోకఁ బోవు, నమ్ముఖమ్మగు నెప్పుడు♦సారు మిాఱి.
ఉ. హెచ్చుగఁ గేకల న్నభము♦నెల్లెడ నింపుచుఁ, బకకాంతికిం
బెచ్చుగ సంజడా లొసఁగ♦వింతహొరంగు, బెడంగుఁగూర్పఁ గాఁ
బచ్చలహారపంక్తులయి♦భాసిలి సాయములచ్చియక్కునన్
వచ్చెడిఁ గంటె కీరములు♦బారులు దీరుచు గూండ్లు సేరఁగన్. ౧౪౭
వ. కావున నీక నిట నుండరాదు మందిరంబునకుం బోవుదము రమ్మని యమ్మంద
యానఁ దోడ్కొని చనియె నంత. ౧౪౮
చం. చిలుకలు సేరె గూండ్లు రొద♦సేయుచు; నింటనె నిల్చి యున్నక్రే
పులు మది రా బిడాన నఱ♦మో మొకయోరగ వంచి వాలము
ల్సొలఁగ నటించుపాముగతి♦లీలగ నెత్తుచు బిగ్గఱం కెలం
గొలుపుచు దాఁటుల న్మిగిలి♦గోవులు వాఱి గృహాళి సేరఁగన్. ౧౪౯
ఉ. మాటికిమాటికిం దనదు♦మార్గనిరోధముగాఁగ వత్సముల్
దాఁటులు వెట్టుచుం బొదుఁగు♦దద్దయుఁ గ్రుమ్ముచు నెత్తివైచుచున్
గాటముగాఁగ నడ్డనిడఁ♦గాఁ గని నాకుచు మేను, గ్రేళ్లుగన్
దాఁటుచుఁ బోయె నాలగుమి♦దా భయ పెట్టుచుఁ గ్రుమ్ముకై వడిన్. ౧౫౦
చం. యవసపుగంపఁ దాల్చి శిర♦మందలిచిన్నిపయంటచుట్టపై
జవజవలాడ నెన్నడుము♦చన్నులభారము సైఁపలేమిఁ జ

స్తనపయిఁ బోటికిం బలెనె ♦ సాట్యము సల్ప నితంబబింబముల్
జవమున వానిపోరు సవ♦సానము సేయఁగ నొక్కొ పాదముల్
తవతవలేక పోవఁగ హు♦టాహుటిఁ గాఁపుమిటారి యేగెడిన్. ౧౫౧

చం. పెడమఱఁ ద్రిప్పి మోము నడి♦వీదినిఁ బోయెడివారిఁ జూడన
క్లెడమను గైనపాదముల♦నేర్పడ నిల్చి నఖాంకురంబులం
దడయక గీఱుచో నసవ♦ధానితనా నెగఁద్రోచి తైక, గ
న్పడ నొకకొంత చన్నుఁగవ♦వాకిట నిల్చిరి జారకామినుల్. ౧౫౨

చం. చలువమడుంగుఁ గట్టి బురు♦సాపనితైక బిగించి మేలిదు
వ్వలువవపయంటలోఁ జనులు ♦ వారక డాఁగురుమూఁత లాడఁగాఁ
దలు పొకయోరమాటుచుఁ బ♦థంబునఁబోయెడివారిఁ జూచి వా
రలు దముఁ జూడ మాటుగొని ♦ క్రాలిరి బాళిని వారకామినుల్. ౧౫౩

శా. దోషోద్ధత్యము మీఱఁ బుణ్యజనసం♦దోహంబు నిస్తుల్యసం
తోషం బొందెను; లోన సంతసిలి ప్ర♦ద్యుమ్నుండు జాగ్రద్దశా
శ్లేషం బొందె; నదృశ్యభావము వహిం♦చెం దారకల్; హేళి సం
శ్లేషానందసుఖంబుఁ గాంచి వికసిం♦చెం బద్మినీసంతతుల్. ౧౫౪

ఉ. ఊహచెడం దమోరి చనె ♦ నోడి, మహానటుఁ డయ్యె వైరి, పాం
థాహితుఁ డైనరాజు హితుఁ ♦ డయ్యె, స్మరోద్ధతిఁ దాళ శక్యమా
మోహతమంబునన్ జగము ♦ ముంచునొకో యనుభీతిచే వరా
రోహలు దీపికాచ్ఛలని♦రూఢినిఁ గంతున కిచ్చి రారతుల్. ౧౫౫

వ. ఇట్లు చీఁకటివడుటయుఁ గౌసల్య దశరథుఁ దలంచి వలపున సుడివడుచు హారా
హారవిహారవిముఖియై యొకరాత్రి వేఁదు రెత్తినట్లు చరించుచుండ ప్రియవయస్య
యమ్మనంబు వేఱొకప్రసక్తిఁ ద్రిప్ప నెంచి యుదయించునిశాచంచలాక్షీమనోహ
రుం జూపి యిట్లనియె. ౧౫౬

ఉ. *పొంగుచుఁ దండ్రి పంపఁ జని ♦ పొందుగ శాస్త్రములెల్ల నేర్చి వే
ర్మిం గురునాన దాటక హ♦రించియుదారమతిన్ సవంబు సే
యంగ నగాధిరాజతన♦యావనుఁడై కృతజీవశర్ముఁడై
రం గగు నాత్మజాతుఁ గను ♦ రాజముఖీ! విధు రామచంద్రునిన్. ౧౫౭

మ. *తనరారన్ జనకుండు పొంగఁగను సీ♦తాతోషణాపాదియై
యనయంబున్ జనమోదదుం డగుచు నా♦ర్యానందకృద్ధర్మవ
ర్ధనుఁడై కౌతుక మొప్ప నిగ్గుగనుచున్♦రాజిల్లె దారాన్వితున్
ఘనసత్తేజు నరిస్మయాపహుఁ జెలీ ♦ కాంచంగదే యర్మిలిన్. ౧౫౮

తే.*కోమిరే! భవితవ్య మిదిగాదొ ♦ కొ మరుఁ డదిగోఁ
దోడునాలియు రాఁగఁ దాఁ ♦ గ్రీడ లీల
వెడలెఁ గాంతారమునుబట్టి♦భూమి తేఁడు
కైకయికిఁ గూర్చు నీ కేల ♦ శోకమంద. ౧౫౯

ఉ. ఈనెల నొప్పుకప్పునకు ♦ నెన్నియొ చొప్పులు లోకు లందురే
కాని యవన్ని దబ్బఱలె♦కా, నెల దా ముకురాయమాణ మౌఁ
గాన నిశాకృశోదరి జ♦గాగయిసేఁతలు సేయఁబూనుచో
వేనలి దిద్దఁ దోఁచుప్రతి♦బింబ ము టంచుఁ దలంతు నెచ్చెలీ. ౧౬౦

వ. అని పలుకుకలికిం గనుంగొని యళుకుగదిరినమనమునఁ దనమనంబు దశరథాయత్తంబై యుంట నెఱుంగఁ జెప్పి. ౧౬౧

సీ. తరమటే సైరింప ♦ స్మరసారతరఘోర,కరవీరశరవార♦ఘాతములకు
వశమటే యోర్వంగ ♦దశదశావశమనో, వశజశాకరనిశా♦పరుచులకును
దలమటే తాళంగ ♦ మలయాగమలయాగ,వలమానపవమాన♦బాధలకును
గలనటే సహియింపఁ ♦ గలనాద ! కలనాద,కలనాదకులమహా♦కులతలకును

తే. బాప! యీపాప మెట్లోఁపఁ ♦ బ్రసవచాప, సుమనిశాపమహాబల♦సమదకీర
కోపకృతతాపమున కోప ♦ నేపగిదిని, సైఁపఁ గలనమ్మవీరల♦యేఁపుఁగొమ్మ!

ఉ. క్రొన్నెలయేపులుం, గడుసుఁ♦గోవెలచూపులు, మారుతూపులుఁ
వెన్నెలమాపులుం, వడఁకు♦వీవలికైపులు, వేఁకితీపులుఁ
వన్నెలచిల్క రాపులు, నృ♦పాలకు నత్తరితీపు లొక్కటై
నన్నిటు లేఁచసాగె లల♦నా! కలనా సయిరింప నీదశల్. ౧౬౩

మ. లలనా! నేఁ గలనా సుఖింప భువనా♦లంకారరూపప్రభో
జ్జ్వలనానావిధభూషణాజివిలస♦ద్బాహాపరిశ్లిష్టనై
వలమానభ్రమరాకులీకృతశుకీ♦పాళీమయూరావళీ
కలనాదారవపూరితోలపశుభా♦గారంబున న్నిచ్చలుఁ. ౧౬౪

వ. అని యిట్లువందురుకుందరదన కూఱటగా. ౧౬౫

కం.శంబరగంధర్వవరుఁ, శంబరకలితాంకు నిహత♦శంబరదనుజుఁ
శంబరజాక్షీమణి యా,డంబరమున ననియెఁ బ్రస్ఫు♦టం బగుఫణితిఁ. ౧౬౬

## —* మన్మథదూషణము. *—

కం. నీ వాకసుకుమారుండవు, నీవి ల్లసుకుమార మయ్యు ♦ నిర్దయ మటరా
యీవగ సుకుమారాంగుల, నీవగలను బాలుపఱుప ♦ నిందిరతనయా. ౧౬౭

కం. కామా తన్వంగుల మో, కామా! సౌఖ్యప్రదాన♦కర్మము నీదే
కా! మాబోటిని నేఁచుట, కా మాపతి నిన్నుజగతి♦గావించె నయో. ౧౬౮

ఉ. మానవదర్పవ్యథాకలిత♦మార్గుఁడవుం దనుజుండ వైనని
న్నానిటలాక్షఫాలనయ♦నాగ్నిఁ బడ్డ సయిరించెఁ ద్రుంపకే
తా నయి లచ్చికై నరక♦దానవదర్పవిదారి, యాజగ
త్త్రాణపరాయణుండు నినుఁ♦ దా మదిఁ బూనినఁ గావ నేరఁడే? ౧౬౯

మ. కమలానాయకు నాత్మనీనులు శుభా♦కారుల్ వయోయుక్తులుం
గమలామందివర్ధనోద్యమపరుల్♦గాంతారభాస్వత్కరుల్
క్షమ నైకల్యన మేతు లుణ్ మఱి మనో♦జాతుల్ గదా గాన నో
కమలాసూనులు! మీర లిద్ద ఱొకఁలై♦కారింతు రజ్ఞాత్ములన్. ౧౭౦

—* చంద్రదూషణము. *—

కం. రుషచేఁ జెనుగా మనుదు, ర్విషమున నాకువునఁ జేరి♦ మొలఁతుక నేఁచన్
విషధరశేఖర! నీవు,ర్విషము నరేంద్రుండు పాచు♦ వెలుపింపకుమీ. ౧౭౧

సీ. మునిశాపము నిశాప♦ నినుఁద్రుంపదాయెఁగా, రోహిణీమాహాత్మ్య♦రూఢినేమొ
సర్పదష్టుఁడ వయ్యు♦ సమసిపోవైతిగా, యోషధీశత్వవి♦శేష మేమొ
దినము వారిధిఁబడి♦ తెగటాఱిపోవుగా, జైవాతృకత్వంబు♦చంద మేమొ
నడిగండిసెలవాఱి♦ మడిసిపోవైతిగా, మఱి సుధాకరుఁడవౌ♦మహిమ నేమొ

తే. కటకటా యిన్నిగండముల్♦గలుగ నీవు, మడిసిపోవక మనుదల♦ మిడిసిపడుట
భళిర! సితల్లికడుపుచ♦ల్వయొ తలంప, విరహిణీజనకృతపాప♦భర మొ చంద్ర!

ఉ. మాయురె! రాతినే నిమిష♦మాత్రమునం గరఁగంగ నీరుగ
జ్జేయఁగఁజాలు జాణఁడవు♦నీ రసికత్వము నీళ్లపాలుగాఁ
దోయరుహాత్ములన్ వెతలఁ♦ద్రోసెద వయ్యయొ దర్శనాశము
జ్జేయు భవత్కళావితతి♦ నేఁడు భయోద్ధతిఁ జూపె జాబిలీ! ౧౭౩

ఉ. సాక్షి దొఱంగి నీవు బుధ♦నైరివి గావుటఁ గాంచి భీతి న
ల్లాడఁగఁ జక్రపాణి పదు♦నాఱుగఁజేసి యజాంగనేశు లా
పీడమునందుఁ గూర్చ నినుఁ♦ బెట్టి మతిన్ హరి బైల గెంటియున్
వీడక యొక్కకంటఁ గని♦పెట్టి రుమాధవమాధవుల్ శశీ! ౧౭౪

ఉ. హా! యన లోకమెల్ల సిత♦హాయన! నీరయిపోవ నీయవ
శ్యాయము న్యాయ్యమేర నిజ♦శార్వరనామము సార్థకంబుగా
మాయురె! తోయజాత్ములను♦మార్తుఁడవై వెస రూపుమాయఁగాఁ
జేయఁగ శర్వరీశ్వర! ప్ర♦సిద్ధివహించెదె కూళ నేఁతలన్; ౧౭౫

సీ. జైవాతృకుఁడు గావె ♦ జీవనాధారమై, పంటపైరులఁ బ్రోచు♦దంట వగుట
జీవజీవము గావై ♦ దేవతాతతికిఁ జ, కోరంబులకు బువ్వ♦కోర వగుట
దివిదివ్వెటివి గావె ♦ తివిరి దరిద్రతా, ధీనదీనాళికిఁ ♦ దెరువు దెలుప
విధుమూర్తివే గావె ♦ వితథంబుగాకుండ, నిందిరాసతి నెద♦నొందియుంట
తే. ననఁగ మేలిగుణంబుల♦ననువుమీఱి, రట్టడిని దేఱి యువతుల♦గుట్టు చెఱిచి
తిట్టుదిననేల యఘ మొడి♦గట్టనేల, కరుణ నేలుము చేపట్టి♦కడలిపట్టి! ౧౭౬

—* మందానిలాదినింద *—

కం. పవమాన! యింతదయఁ దలఁ, పవ మానవతీచయంబు♦పట్టుల నయమో
పవ మానవ చెలి వెత నిడు, నవమానపుఁజేఁత లేటి ♦ కయ్యా పవనా! ౧౭౭
సీ. నుడికార మేది నీ♦నుడి కార మగు టేమి, కీరమా! యిది నయ♦గార మటవె
షైకమా! మీకేమి ♦ మైకమా యనుకంప, సైకమా మది విర♦సైక మటవె
పయ్యెరా! యెంత రా ♦ పయ్యెరా చెలికిఁ గై, పయ్యెరాపయి ఋసు♦పయ్యెరాకు
తాళుమా యింతకాం♦తాళమా మత్తహిం, దోళమా! రిత్తరో♦దాళ మేల
తే. గాసిపెట్టెదవే ఘులు♦కాసిపులుఁగ, కర్జమే పులుగాకు ప♦ల్గాకులార
నీసదాచారమా జడా♦నిలమ యిదియు, నీమలీమసతయు నిదే♦యేమొ యళిని.
ఉ. చాలుర చాలురా కినుక ♦ జాణర జాణెత గాదురా చలం
బేలర? బేలరా పెరుఁగు♦నీఁదర నీదర మేదురా కడుం
దూలెర తూలరాశిగతి ♦ నొచ్చుర మచ్చర మెచ్చనీకురా
గోలర గోల రా పిడుఁగుఁ♦గోరక కోరకదంతఁ బ్రోవరా. ౧౭౯
మత్తకోకిలము. బాల యేఁటను భీత యేఁచును ♦ వ్రాలుచుం ధర సోలెరా
గోల మన్చినఁ బుణ్య మందురు ♦ గూల్పుఁగం ఫల మేమిరా
చాలుఁ గిన్కను బుద్ధినుంపక ♦ శత్త్రుముం ధర వీడరా
చాలు నన్విని ప్రీతిమై సతి ♦ జాలి ముంపఁగఁ బోకురా. ౧౮౦
వ. అని యిట్లు మారకూపారకుమారకీరసమీరంబుల నిందించుచెలిం గని కౌసల్య యి ట్లనియె. ౧౮౧
చం. తనకులనాశకుం డతఁడు ♦ తమ్ముఁడు తమ్ములమేలు నోర్వఁడో
దననిలయంబుఁ గూలఁ ద్రోలు♦త న్నెగఁజిమ్మ నితండు పుత్త్రుఁడో
వనితరో! భార్గవీసతి త♦పంబు లవెట్టివొనర్చెనో కదా
తనకిటువంటిసూను లిల ♦ దాపుర మాటకు మత్తకాశినీ. ౧౮౨
ఉ. చందనగంధులార! చని ♦ సందులగొందుల వాడవాడలం
గ్రందుగ భూమియందలిపు♦రంబులఁ జాటఁగఁ బంపుఁడీ వెసం

బొందుగ రాజునాజ్ఞ యని ♦ పొంగణఁగంగను మిన్న చూలికిన్
ముందుగఁ గాళ్ళఁ దంచును స♦మున్నతచందనభూమిజాతముల్. ౧౮౩

వ. అని యిట్లు ౧౮౪

శా. బాలారత్నము శయ్యపైఁ బొరలుచుం ♦ బ్రాలేయరుగ్బింబము
ద్వేలాభీలనిజాంశుజాలములఁ గ ♦ స్తింబెట్ట హస్తాంబుజం
బోలిం జెక్కునఁ జేర్చి యేడ్చె మిగులన్ ♦ దోయ్గాయనీమంజరీ
మేలోదంచితవల్లకీకలరవో♦న్మేషంబుఁ బోషించుచున్. ౧౮౫

వ. ఇట్లంతకంతకు గుఱువులువాఱు నెలంతకంతుసంతాపంబు నిశాంతంబుతోఁగాని
యంతంబునొందదని పలుతెగల నూరార్చుచు వేఁకువచిన్నెలం గని. ౧౮౬

## ప్రాతఃకాలవర్ణనము.

చం. కవి యడఁగఁగానఁ బుణ్యజన♦కాండగురుం డగుఁగాన నెంతయే
నవికలపక్షపాతమునఁ ద♦దాగమనంబున నుత్సహించుచుం
గవినికరంబు లుచ్చెడిని ♦ గర్ణరసాయన మాసుధోక్తులం
బ్రవిమలభావ మొప్పఁ గను♦మా యనుమానము మాని మానినీ. ౧౮౭

ఉ. ఆరసి పద్మినీవధుయు ♦ నాదిగఁ గల్గినయాత్మకృత్యముల్
చేరువమైన నాహరియుఁ ♦ జింత నితాంతము నందు మీఱఁగా
దారదవర్జితం బయిన♦దర్పణమో యన వెల్ల నౌచు నో
సారసనేత్ర! చంద్రుఁ డదె ♦ జాఱెడిఁ గంటివె పశ్చిమాంబుధిన్. ౧౮౮

సీ. ఉవథుగాఢవ్యథా♦వివృతాస్యగహ్వరం, బగుఁగాని ముదితరో ♦ మృగము గాదు
శ్వాసదుస్సహకోర♦శాసముద్భవ బాష్ప,ములుగాని నునుమంచు♦బొట్లు గావు
ఉపశాంతికై పేల్చి♦యుమ్మెత్త నూర్పుచ్చ్ఁ, బొగ గానివెన్నెల♦వగయుఁ గాదు
పెల్లుతూపోషించిన♦గల్లయే పచ్చిక, బూఁజుపై నివముక్రొం♦బురుఁగు గాదు

తే. కర్మ మెవ్వారికైన భో♦క్తవ్యమనుట, మఱచి వననిధిఁబడియెడు ♦ మగువ విధుఁడు
రాజయక్ష్మార్తిఁ దెగియెడు పోయెఁ ♦ దేజమెల్ల, వీని కేటికి వెఱవంగ ♦ వెఱ్ఱిదాన! ౧౮౯

చం. కడఁగి తమోవృతం బయి జ♦గంబు నిశాటమహాహాద్ధతిం భరం
పడుచును వేఁగుచుండ ద్విజ♦వారము లొక్కటఁ గూయివెట్ట దం
దడి కరుణారసాప్తి జన♦నందనుఁడై జనియించు రాముఁడై
వడి హరి నీమొడం గనుమి ♦ పద్మదళద్యుతిలక్ష్మణాన్వితున్. ౧౯౦

కం. రామా వేగనె పంచెద, నీమనమున సంతసంబు ♦ నివ్వటిలంగా
భూమిజ ప్రియాన్వేషార్థము, నామదికిం గూర్చునట్టి♦నయగుణమణులన్. ౧౯౧

వ. అని యిట్లూరార్చె నంత. ౧౯౨

ఉ. "త్సుప్రి" వ్వని లేపి యెడ్ల వెలిం♦దోలి "కిరో" యని నీరువెట్టి పె
న్దవ్వుగ నీవ లావలఁ జ♦నం "గొకకోబ్బ" యటంచు నిల్పి త్రాఁ
జివ్వునఁ గాడి నట్టుపయిఁ ♦ జేర్చి వహించుచు మేడితోఁక మి
న్ముప్ప వ్వదయించుకంటె మును ♦ పోయిరి కాఁపులు చేలఁ జేరఁగన్. ౧౯౩

ఉ. చేలచెఱంగు చెక్కి కరి♦చీపయి వర్తిలి పేరువెట్టి మం
దాలను బిల్చి జానుయుగ♦ళాంతరకీలితకుంభసీమలోఁ
బాలను సుఱ్ఱుసుఱ్ఱు మను♦ధ్వానము మోదముగూర్పఁ గాఁపుఁబ్రో
యా లిరుచేతులం బిదికె ♦ నప్పుడు డయ్యక స్రుక్కు కంతయున్. ౧౯౪

సీ. తమ్ములతోడఁ గం♦దమ్ములు విచ్చెను, దమముతో స్మరమోహ♦తమము విరిసె
వాకు లుద్ధతకృక♦వాకుల నన లెత్తెఁ, బవనంబు వెడలె ను♦పవనములను
దెలవాతెఁ గాముకి ♦ తెలవాఱె వెరవేకి, రెడ్లు చేలను జేరి ♦ రెడ్లతోడ
నలులతో ముద్దుఁదో♦య్యాలులు మేల్గాంచిరి, ద్విజులను మేల్గొల్పె ♦ ద్విజకులంబు

తే. పంచపంచ యటంచాడి ♦ బ్రాహ్మణతతి, పంచెపంచెయటంచూని ♦ వ్యార్ప్రనిల్చిది
పంచపంచలఁ గేల్మొగు♦లించికొనుచుఁ, బంచపంచద్వయాత్మ న♦ర్చించె నంత. ౧౯౫

ఉ. ప్రముచ్చిల రేయి చేపడమి ♦ రొక్కము లిక్కలు చేరినట్టి పె
న్ముచ్చులు జారిణీసురత♦మోహవిలోలమతుల్ కువేశ్యలుం
బెచ్చుగ సోమరుల్ క్షువథు♦పీడితులున్ మఱి విప్రలబ్ధలున్
హెచ్చుగ నిద్రగూరి రెద ♦ నెంచక యభ్యుదితత్వదోషమున్. ౧౯౬

ఉ. మింట వెలింగె వేవెలుఁగు ♦ మేల్కొను మమ్మ యటంచు లేపఁ దా
రొంటరమింటరంబు లని ♦ యున్నని దాసినిఁ దిట్టి భీతి లో
నంటక పొర్లి రింటఁ దమ♦యత్త ననంద యు లేమిఁ గంటులే
కొంటరికాఁపురంబు గని ♦ యొప్పినమేటితుటారికత్తియల్. ౧౯౭

వ. ఇట్లు విరహవేదనాదోదూయమానమానస యగుకౌసల్యయూఱడం బ్రియవయస్య
ముద్దుఁజిలుకం జూచి. ౧౯౮

శా. *తారాకాంతుఁడు పెంపుదూలె వెఱఁగం♦దం దీఱె నాయంకిలుల్
ఆరన్ భూమిపరాగముల్ వెలసెఁ గాం♦తాన్వేషణార్థంబు నె
వ్వారిం బంచెదవో ఖగాన్వయమణీ ♦ వైళంబ శైలాపగా
పారావారవిలంఘనక్రమపటు♦వ్యాపారపారీణులన్. ౧౯౯

వ. *అనిన నారామవాక్యంబుల నప్పతంగకులపుంగవుండు విని ప్రియవయస్యాస్యంబుఁ
జూపుటయు. ౨౦౦

కం. *వినుమా! సరి దాక్షిణ్యం,బును మానక రామభద్ర♦ముద్ర యిదే కై
కొనుమ యభిజ్ఞానమునకు, ననుమా నయమార హితము ♦ లాదట్టఁజనుమా. ౨౦౧



## శు క సం దే శ ము.

వ. *అనిపంచినఁ జని చని కొంతకాలంబునకు మరలి వచ్చి నీ ప్రియకాంతోదంతంబు సెప్పెద విను మని. ౨౦౨

ఉ. *ఆనతిమేర కేఁ జని ర♦యంబునఁ బట్టనముల్ ధరంబులుం
గానలు గోనలుం గడచి ♦ క్రన్నన సింధువు దాఁటి యచ్చటన్
దానవగేహసీమఁ బ్రమ♦దావనమందు వసింపఁ గంటిఁ జం
ద్రానన రామ రామ యని ♦ యాఁజనికూర్మిఁ దపించుచుండఁగన్. ౨౦౩

తే. *చేరి శాఖాగ్రమునఁగొంత♦సేపు నిలిచి, కనఁబడకయుండి యతనువే♦దనఁ గృశించి
రామ రామా యటంచును♦భామ పలుక, నీనిమిత్తంబకా మది♦నిశ్చయించి. ౨౦౪

తే. *రామ ! నీనామకలితమై♦క్రాలుముద్ర, జాఱ విడిచితిఁ గొమ్మల♦చాటు నుండి
దానిఁ గని నిన్నుఁ గనినట్టు♦మానసమునఁ, దలఁచుచు నుద్వేలధరియించి♦వలపుమించి.

మ. కర మాహ్లాదము మీఱ మానసమునం ♦ గాంచ న్నినున్ ముద్దుటుం
గరమా! నెచ్చెలిఁ జూచిన ట్టిటకు రాఁ♦గాఁ గారణం బేమి ? యె
వ్వరిహస్తాబ్జ మలంకరించెదవొ ? తె♦ల్పన్ రాదొకో ప్రేమ శ్రీ
కరమా నాతరమా యెఱుంగఁ బ్రియవా♦క్యం బొందు రానీఁగదే. ౨౦౬

చం. అడిగితి నెవ్వ రీవనుచు ♦ హా ! తెలిసెన్ క్షమియింపు దూఱకే
జడమతి నైతి నే యెఱుఁగఁ♦జాలవె ము న్నొకమాటు చూచి యం
చడలుట వల్ల భార్థముగ ♦ నాత్మ వివేకము దప్పు టయ్యె నీ
యెడ నిది యెగ్గు సేఁత కృప♦యేర్పడఁ జెప్పకు మంబుజాక్షికిన్. ౨౦౭

తే. ఆర భవదీయముఖకలి♦తాక్షరత్ర,యమును జూడంగఁ దైవ్రవర్గ్య ♦ మమరుభావి
భద్రసూచనగాఁ దోఁచె ♦ భద్రముద్ర ! నిక్క మాఁగద చెప్పుమా ♦ నిర్ణయముగ.

మ. సరసోదంచితశస్తసద్గుణమణీ♦జాలాలవాలంబునై
కర మొప్పారుటఁ గాదె నిన్ను నవలా ♦ గారామునం దాల్చు నా
దరముం జూపి వచింపుమా యొకఁడు తా♦త్పర్యంబుతో వేఁడెదం
దరుణీరత్నము గారవించుమణిము♦ద్రా! భద్రమా కాంతకున్? ౨౦౯

ఉ. ఆయలినీలవేణి లలి♦తాంబుజపాణి శుకాభవాణి లో
లాయతమీననేత్ర కన♦కాంచితగాత్ర ముఖావమానిత
ప్రాయసుధాంశుబింబ మధు♦రాధరబింబ సుఖావలంబయే?
“నా” యనిచెప్పఁజాలఁ గరు♦ణామతి నాపయిలేమిఁ గొంతకున్. ౨౧౦

చం. స్థిరకరుణాతిరేకమునఁ ♦ జేర్చుఁ గదా యురమందు మాటికిన్
వరహితవృత్తిమైఁ బలుకు♦వాక్యముల న్వినుచుందువే కదా

తరళవిలోచనామనము • త్వత్ప్రతిపన్నముగాదె పల్కు మా
దరమున బాలనెమ్మనము • దాపక కన్నులఁబోల దాఁగదా. ౨౧౧

చం. వెలఁదికరంబున న్వెలుఁగు•వేళ నితాంతముఁ గాంతిసంపదన్
వెలయుచునుంటి వీ విపుడు • వేఱుగఁ దోఁచెద వేల చెప్పుమా
యలఘువియోగభారమున • నంగన కుందఁ దదీయరీతులం
జెలఁగెదొ? యింతసేపు సతి•చెంగట లేమిరొ మద్విధంబుగన్! ౨౧౨

శా. ఆలీలారమ యావిలాసగరిమం • బావాక్యనవ్యామృతం
బాలావణ్యవిశేష మానయగుణం • బానీలవేణీభరం
బాలోలాంబకవైఖరీవిలసనం • బామేలియొయ్యార మిం
కేలీలావతియందు నైనఁగలదే • యెంతెంత చింతించినన్. ౨౧౩

మ. కనఁ గెంగేలఁ బయంటకొంగు దనరం•గా నిల్చుచున్ సామువో
ద్వనఁ గన్నుంగవ రాగలజ్జలను సొం•పుంబెంపఁ గ్రొంజెమ్మటల్
చినుకన్ మోమున నామిటారమును యో•జింపంగ నా కిప్పుడుం
గనులం గట్టినయట్టు లున్నది గదే • కంజాక్షి వీక్షారతిన్. ౨౧౪

ఉ. చెక్కునఁ జేయి చేర్చునెడఁ • జిక్కులు పాచెడివేళఁ గొప్పునన్
మక్కువమీఱఁగా శ్రవణ•మండనముల్ సవరించుపట్ల నీ
వక్కడనే మెలంగెదు క•దా! చెవిలోన వచింపు నాపయిన్
మక్కువఁ బాయఁగా వలదు • మానిని! యంచును రత్నముద్రికా. ౨౧౫

చం. చపలమనీష లౌట స్వవి•చారవిదూరలు బాలికామణుల్
కృపయును గల్గునే యనుచు • నేటికిఁ బ్రశ్న మొనర్పఁ? గల్గనే
నపరిమితానురక్తహృద•యంబున నేలక నాఁడు వోవునే
త్రప యనుసాకు పెట్టుకొని • తద్దయు మాఱుమొగంబు వెట్టుచున్? ౨౧౬

ఉ. నా కిఁకఁ దెల్పుమా సకియ • నాకడకు న్నినుఁ బ్రేమఁ బంచెనో ?
లేక మదీయవర్తనము•లీల నెఱుంగఁగ నీవ వచ్చితో
ప్రాకటపార్శ్వవర్తిశుక•వల్లభసంగతిచే గుణాఢ్య ర
త్నాకర! సజ్జనావన మ•యారె స్వభావముగాదె నీకిలన్. ౨౧౭

తే. నేఁడు సౌందర్యఖని వైన•నిన్నుఁ జూడ, భామ సాక్షాత్కరించిన•పగిదిఁదోఁచె
వెలయునీయంతరంగంబు•వివరముగన, భామ దానట్టులో యను•భ్రమయు దోఁచె.

తే. మాన్యవృత్తంబునై యెక్కి•మదికి మఱి తుదమొదలును లేని నిన్ను ను•దర్శనంబ
తాఁదలంచెద నేఁడు నా•కై రహింప, నతనుభూతవ్యథాశాంతి • యగునెనాకు ?

వ. అనిన నే ని ట్లంటి. ౨౨౦

ఉ. దేవర ! తల్లిదండ్రులయ♦ధీనలు బాలలు గారె ? స్వేచ్ఛమైఁ
దీవరపాటు నన్నె సుద♦తీమణికోటికి? నొంటిపాటునన్
భావజరూపు లైనమగ♦వారలు డాసినచోట గోల ల
జ్జావతి యాట నేరమె ? వి♦చారము సేయుము దూఱనేటికిన్. ౨౨౧

ఉ. రూపముచేతనే మనము ♦ రూఢిగఁ జూఱలు గొంటి దంటవా
ల్చూపులమాత్రనే తనువు ♦ సొక్కఁగఁ జేసితి తీపుమాటలన్
గైపునఁ గైవసంబు గను♦కై పొనరించితి వింత చేసి మా
పాపనె దూఱనాడెదవు ♦ పాపము ! నీ కగునయ్య యీకృతుల్? ౨౨౨

శా. ఓయ్యారంబు త్వదీయ మయ్యెడల మా♦యొయ్యారి వీక్షించి మే
ల్నెయ్యానన్ విరహాగ్నిఁ గ్రాఁగెడిఁ దనూ♦లీలావికాసచ్యుతిన్.
అయ్యో ! పాప మనంగ నేరదు సుమీ ♦ యాయల్లకోద్విగ్నయై
యయ్యోపాప మనంగ నేర వకటా ♦ న్యాయంబె నీకోటికిన్? ౨౨౩

చం. ఘనత భుజాంకపాళి ధర ♦ గౌతుక మందెను నీల నన్మనో
వనగుణధర్మరూపవిభ♦వంబుల కై ప్రథ నిన్నుఁ గైకొనెన్
వనజదళాక్ష ! నీహృదయ♦వారిజవాసిని గాఁగ నే విలా
సిని మఱియున్నె మారమణిఁ ♦ జిత్తమునం దెడసేసితేనియున్. ౨౨౪

తే. కొమరుమిగులంగ నీవుగై♦కొనితి వేని, జీవితేశుండ వౌదఁట ♦ సిద్ధముగను
గొమరుదలఁగంగ నీవు గై♦కొనక యున్న, జీవితేశుండ వౌ దఁట సిద్ధముగను.

ఉ. కోరిన నింద్రచంద్రనల♦కూబరమారులనైన మెచ్చ దా
మారమణీమతల్లి నిను ♦ మానసనాథు వరించె భూభృదు
ద్ధారముఁ జేసితో సురలఁ ♦ దప్పక ప్రోచెదో రంభనైన లోఁ
గోరవొకో మహేశమద♦కుంతనశీలివో పల్కు మేర్పడన్. ౨౨౫

తే. విషముతోఁగూడఁబుట్టని♦విబుధవంద్య,పతినిహృదయయంబుననుదాల్చు♦పరమసాధ్వి
చంచలత్వంబుఁ గాంచని♦చంచలాభ, మారమణి యెంచఁగా రమా♦మణికి మిన్న.

తే. సమరముల నిన్నుఁ గీనాశ♦సముదయములు, ప్రాణనాథునిఁగాఁ జూడ♦భావముననె
బ్రమదమున నిన్నుఁ గోరెను ♦ బార్థివేంద్ర, ప్రాణనాథునిఁగాఁగ మా♦పంకజాక్షి.

చం. అనుచును మాటలాడుతఱి ♦ నాతనిమంత్రులు వచ్చి దేవ ! మీ
రనిచినమంత్రియున్ గురుఁడు ♦ హర్షవికాసము దోఁప భానుమం
తునిపురినుండి వచ్చి మిముఁ ♦ దోడ్కొని రమ్మనినారు వేగమే
కనుఁగొన నేగుదెం డనినఁ ♦ గాంత ! నృపాలుఁడు వోయె గ్రక్కునన్. ౨౨౬

ఆ. భానుమంతుఁ డనెడి♦పల్కు నాచెవిఁ బడ, నొకవిశేష మచట♦నుండు ననుచు
మారివెన్నడించి ♦ వైనంబుగా వింటి, వారివాక్యసరణి ♦ వనజనయన ! ౨౨౭

